శ్రీ మద్భగవద్గీత
(పంచమ ముద్రణము)
వ్యాఖ్యాత:
శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
వెల రు. 4-0-0. పోస్టేజీ రు. 0-9-0.
ఆంధ్ర గ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాసు.

# ఆంధ్రపత్రిక

317597

తెలుగు మెఱుగులు
గ్రంథకర్త:
శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
వెల రు. 2/- తపాలాఖర్చులు 0 7 0
ఆంధ్ర గ్రంథమాల,
6,7, తంబుశెట్టివీధి, మద్రాసు.

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 238 THURSDAY 1st DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# గవర్నర్ జనరల్ ఉత్తరువు జారీఅవడానికి ముందే అన్ని సమస్యలూ పూర్తిగాపరిష్కారం కావాలి

## ఆంధ్రరాష్ట్రనిర్మాణ విధానంపై రాష్ట్ర ప్రభుత్వానికి కేంద్రప్రభుత్వ సూచనలు

## 1950 ఏప్రెల్ 1 నుండి ప్రత్యేకాంధ్రప్రభుత్వం వ్యవహరించుట వాంఛనీయమని ఆర్థిక నిపుణుల భావన

## చెన్నపట్టణం ఉమ్మడి రాజధానిగా ఉండరాదని కేంద్ర మంత్రులకు తమిళుల నివేదన

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయంలో కాంగ్రెస్ కార్యవర్గం చేసిన తీర్మానాన్ని పురస్కరించుకొని భారతప్రభుత్వ హోంశాఖాకార్యదర్శి హెచ్.వి.ఆర్.అయ్యంగారు చెన్నరాష్ట్రప్రభుత్వమునకు వ్రాసిన లేఖలో విభజనకు సంబంధించిన యావత్తు విషయములు, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు సంబంధించిన అన్నివివరములు గవర్నర్ జనరల్ ఉత్తరువు జారీ అగుటకు పూర్వమే నిర్ధారణ కావలసియుండునని సూచించినట్లు తెలియుచున్నది.

రాష్ట్ర, కేంద్రశాసనసభల సభ్యులనుంచి ఆంధ్ర, ఆంధ్రేతర ప్రతినిధులకు సమాన నిష్పత్తినుండునట్లుగ రాష్ట్రప్రభుత్వము ఒక సంఘమును, ఆ సంఘమునకు సహాయపడుటకు ఉపసంఘములును నియమింపబడవలెనని, ఈ మొదటి కమిటీ అన్ని విషయములందును ఏకాభిప్రాయమునకు రావలసియుండుననికూడ హోం శాఖా కార్యదర్శి ఈ లేఖలో స్పష్టముచేసినట్లు తెలుస్తున్నది. ఆంధ్రరాష్ట్రనిర్మాణము ఇప్పటి చట్టంలోని 290 సెక్షన్ ప్రకారం జరిగినా, నూత్నరాజ్యాంగం ప్రకారం జరిగినా ముందు ఈ విషయాలన్నీ పరిష్కారం కావలసిందే గనుక ఇది ఇప్పుడే తేలడం మంచిదని హెచ్. వి. ఆర్. అయ్యంగార్ వివరించారు. అని తెలుస్తున్నది,

ఈ లేఖలో ఈక్రిందివిధంగా ఉన్నట్లు తెలియవచ్చినది :—

"అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గం వారు నవంబరు 16-వ తేదీన సమావేశమై నిర్వివాదమైన తెలుగు జిల్లాలలో [illegible] (2 వ పేజీ చూడుడు)

(2 వ పేజీ చూడుడు)

## తుపాను బాధితుల సహాయార్థం కలకత్తాలో వసంతకోకిలం గానసభ

### రాజాజీ హాజరు: బెంగాల్ ప్రజలకు గవర్నర్ కైలాసనాధకట్జూ విజ్ఞప్తి

కలకత్తా, నవంబరు 29: గవర్నర్ జనరల్ రాజగోపాలాచారి గారి కళ ఆంధ్ర వరద బాధితుల సహాయార్థం ఏర్పరచిన శ్రీమతి వసంతకోకిలం గాన సభకు హాజరైనారు. ఈ సభ ప్రభుత్వ భవనంలో జరిగింది. ఈ సభకు పశ్చిమబెంగాల్ గవర్నరు కైలాసనాధ కట్జు అస్సాం గవర్నరు శ్రీ ప్రకాశ గారలు కూడా వచ్చారు.

శ్రీమతి వసంతకోకిలం ఆంధ్రదేశంలో వరద బాధితుల సహాయార్థం నిధి వసూలు చెయ్యడానికి ప్రత్యేకంగా కలకత్తా వచ్చారని తెలుస్తున్నది.

ఈ సందర్భంలో మాట్లాడుతూ పశ్చిమబెంగాల్ గవర్నర్ కైలాసనాథ్ కట్జూ [illegible]

### ఢిల్లీలో "ద్వారం" వారి రెండో కచేరి

నెహ్రూ ప్రశంస: తుపాను బాధితులకు సహాయం

న్యూఢిల్లీ, నవంబరు 29: [illegible]

## "ఉద్యమ" విజృంభణకు కొమిన్‌ఫార్మ్ సంకల్పం

### పశ్చిమరాజ్యాల్లోనికమ్యూనిస్టులను కూడదీయడానికి తీవ్ర కార్యక్రమం

లండన్, నవంబర్ 29: [illegible]

(2 వ పేజీ చూడుడు)

## అమెరికా కొత్త అణ్వస్త్రాలు

### పసిఫిక్ ద్వీపంలో శక్తిపరీక్ష చేయడానికి అమెరికా నిర్ణయం

వాషింగ్టన్, నవంబర్ 29: 1948 సం॥ తరువాత తాను తయారుచేసిన కొత్త అణ్వస్త్రాల శక్తిని పరిశీలించటానికి పసిఫిక్ సముద్రంలో ఉన్న ఎనివెటాక్ ద్వీపంలో పరీక్షలు జరపబోతున్నామని అమెరికా ప్రభుత్వం నేటిరాత్రి ప్రకటించినది. రష్యా అణువిచ్ఛేదన రహస్యాన్ని సాధించినదని సెప్టెంబర్‌లో అమెరికా వెల్లడించిన తరువాత అమెరికా చేయబోతున్న మొదటి పరీక్ష ఇదే.

ఎనివెటాక్ ద్వీపం మార్షల్ ద్వీపసమూహానికి చెందినది. [illegible]

## రాజాజీ వద్దకు నాగజాతి రాయబారం

### భారతప్రభుత్వం తరఫున హామీ

షిల్లాంగ్, నవంబరు 28: భారత గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారి గారు [illegible]

## పెద్దఎత్తున సహకార సాగుబడిపద్ధతిఅమలు

### వ్యవసాయ ఉద్యోగులసభ నిర్ణయం

### 1951 లోపుగా ఆహార స్వయంసమృద్ధి సాధించగలమని విశ్వాసం

న్యూఢిల్లీ, నవంబరు 29: మొన్న శనివారంనించి ఇక్కడ రాష్ట్రాలలోను, సంస్థానాలలోను ఉన్న వ్యవసాయాధికారుల సమావేశం జరుగుతున్నది. ఈ సమావేశంలో వ్యవసాయానికి భూవైశాల్యం ఎక్కువ చెయ్యాలనీ, దానికోసం చిన్న చిన్న భూభాగాలు కలిపివెయ్యాలనీ, మొక్కలకు వచ్చే తెగుళ్లను పూర్తిగా నిర్మూలించి వెయ్యాలనీ, బంజరుభూములను విధిగా సాగుచేయించాలనీ, పురపాలకసంఘాలచేత నిర్బంధంగా మిశ్రమపు ఎరువు తయారు చేయించాలనీ నిర్ణయించారు.

వ్యవసాయానికి సంబంధించిన ఇనుము, ఉక్కు, సిమెంటు, [illegible]

(2 వ పేజీ చూడుడు)

## హైదరాబాదు సంస్థాన భాషాప్రయుక్త విభజనకు నాంది?

### బొంబైలో బాఖ్లే మొరార్జీ దేశాయి చర్చలు: త్వరలో ప్రభుత్వ ప్రతినిధుల సమావేశం

బొంబాయి, నవంబరు 29: బొంబాయి హోం, రెవిన్యూ శాఖల మంత్రి మొరార్జీ దేశాయ్, హైదరాబాద్ ప్రధాన సివిల్ పరిపాలనాధికారి డి. ఎస్. బాఖ్లేగార్ల నేటి ఉదయం యిక్కడ, హైదరాబాద్, బొంబాయి మధ్య ప్రాంతీయ సరిహద్దుల సర్దుబాటు విషయాన్ని గురించి చర్చ జరిపారు. డిసెంబరు 2న బొంబాయి, హైదరాబాద్, మైసూరు, మద్రాసు ప్రభుత్వ ప్రతినిధులు ఢిల్లీలో సమావేశమై ఆయా రాష్ట్రముల మధ్య ప్రాంతీయ సరిహద్దుల సర్దుబాటు విషయాన్ని గురించి సమగ్ర చర్చలు జరుపగలరని భావించబడుతున్నది.

## చక్కెర కొరతపై పార్లమెంటులో ప్రశ్నలవర్షం

### చర్చకు ఒకరోజు కేటాయింపు: మావ్‌లంకర్ హామీ

న్యూఢిల్లీ, నవంబరు 30: "పంచదార కొరత విషయమై ఇంత ఆలజడి జరుగుతూండగా ప్రభుత్వానికి దీన్ని గురించి సమాచారం కించిత్తుకూడా తెలియకపోవటం చాలాతమాషాగా వున్నది." అని పండిట్ హృదయనాధ కుంజ్రూ అనేసరికి పార్లమెంటు సభ్యులంతా కోలాహలంగా హర్షధ్వానాలు చేశారు.

ఈ విషయం చర్చకు వచ్చినప్పుడు ఆ విమర్శ వారు చేయవచ్చు. పంచదార సమస్య విషయమై చర్చ జరగటానికి ప్రత్యేకం ఒక రోజు కాలం యిస్తా" అని పార్లమెంట్ అధ్యక్షులు మావ్‌లంకర్ అన్నారు.

'ఈ చర్చకుముందు, దీని విషయమై ప్రభుత్వం దగ్గరవున్న భోగట్టా యావత్తూ సభికులకు అందజేస్తా' అని ప్రధాని నెహ్రూ అన్నారు.

ఆర్. కె. సిధ్వా: పంచదార నిల్వలను వశపరచుకోమని రాష్ట్రప్రభుత్వాలకు ఏ తేదీన ఈ తరువులు జారీచేశారు. [illegible]

(2 వ పేజీ చూడుడు)

# ప. గో. కాంగ్రెసువారిపై క్రమశిక్షణచర్య

## డా॥ పట్టాభి నిలుపు చేయుటంపై కె. ఓబులరెడ్డిగారి విమర్శ

నిడుబ్రోలు, నవంబరు 28: పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసు కమిటీలో కొందరిమీదను, కొంతమంది ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటి సభ్యులమీదను, తీసుకొనబడిన చర్యను గురించి, రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి కందుల ఓబులరెడ్డిగారు, యిచ్చట, నేడు పత్రికా విలేఖరులతో, యీ విధంగా చెప్పారు.

"మేము, తీసుకున్న క్రమశిక్షణచర్య విషయంలో, యేమాత్రం పొందరపడలేదు. జిల్లా కాంగ్రెసు కమిటి ద్రవ్యాన్ని దుర్వినియోగం చేసినందుకు యం. వి. రాజుగారిమీద, కాంగ్రెసు క్రమశిక్షణకు వ్యతిరేకంగా నడచిన కొంతమంది కాంగ్రెసు సభ్యులమీద ఇదివరలో మేము తగు చర్య తీసుకోవటం, అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులు అనాలోచితంగాను, అనాలోచితంగాను రద్దు చేయటం, యింకా మేము మరువలేదు. యమ్. వి. రాజుగారినేరం గొప్ప నేరం. లోగడ అధ్యక్షునిచే నియమించబడిన శ్రీ ఆర్. ఆర్. దివాకర్ (ప్రస్తుత భారత ప్రభుత్వ మంత్రి) గారు, రాజుగారి నేరం చాలా గొప్పదని, తగు చర్య తీసుకోవలసిన అవసరం వుందని, ధ్రువపరచారు. ఇటువంటి గొప్ప నేరములకు బహు కొద్ది మందమీద మాత్రమే చర్య తీసుకున్నది, అన్ని రాష్ట్ర కాంగ్రెసులలోకీ, మన ఒక్క రాష్ట్రకాంగ్రెసు మాత్రమేనని మరువరాదు. కాని దురదృష్టవశాత్తు, మా యొక్క ప్రతిచర్యను కాంగ్రెసు అధ్యక్షులు రద్దు చేశారు. అందువల్ల కలిగిన ఫలితమేమిటంటే, కాంగ్రెసు క్రమశిక్షణ కుంటుపడటమేగాక, రాష్ట్రకాంగ్రెసు నిర్వీర్యమయినది. పశ్చిమగోదావరి కాంగ్రెసు తిరుగుబాటువల్ల, కాంగ్రెసు అభ్యర్థి ఓడిపోవటం జరిగింది. ముందుగానే హైకమాండువారికి తెలియపరిచి, వారి సహకారం పొందనిదే యే పని చేయటం మా వుద్దేశ్యంకాదు. ఈ దృక్పథంతోనే, నేను క్రిందటినెల 20 వ తేదీన ఢిల్లీవెళ్లి అందుబాటులో నున్న హైకమాండు సభ్యులను, అందులో ముఖ్యముగా సర్దారు పటేల్‌గారిని కలుసుకున్నాను. మేము జరుపు ప్రతి న్యాయసమ్మతమైన కార్యంలోను వారి పూర్తి సహకారం వాగ్దానం చెయ్యబడింది. కార్యదర్శి కళా వెంకట్రావుగారితో కూడా సంప్రదించాను. ఇటువంటి వారిపై తీసుకోవలసిన చర్య యేర్పాట్లతో తాను పూర్తిగా ఏకీభవిస్తున్నట్లు వారు వక్కాణించారు. తమ కారణాలు వుదహరిస్తూ యే కాంగ్రెసు సంఘమునైనా, యే కాంగ్రెసు సభ్యునినైనా, అత్యవసర పరిస్థితులలో రెండు నెలలు సస్పెండుచేసే అధికారం రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షునకు కలదనే సూత్రాన్ని నాకు చూపించింది వారే. ఈ అత్యవసర స్వభావాన్ని మేమిద్దరము విపులముగా చర్చించాము.

మదరాసులో వుండగా, అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షునకు, అల్లూరి సత్యనారాయణ రాజుగారు అప్పీలు చేసినట్లు తెలిసి, యీ విషయంకూడా వెంకట్రావుగారితో సంప్రదించాను. ఈ నెల 8, 10 12 తేదీలలో ఆయన విజయవాడ విచ్చేసినపుడు, యీ సంవత్సరంలో రాష్ట్ర కాంగ్రెసువారి చర్యలలో తాము యే విధమైన జోక్యం చేసుకోమని వారు గట్టిగా వాగ్దానం చేశారు.

10 వ తేదీ రాత్రి యీ తిరుగుబాటుదార సభ్యులను ఖండిస్తూ మేము ఒక తీర్మానంచేసి, ఆయనగారికి చూపాము. వారు అసమ్మతి చూపలేదు. మామూలుగా చేయవలసిన అవసరం లేనప్పటికీ, జనుకటి అనుభవం పూర్తిగా జ్ఞాపకం వుంచుకొని, తగు జాగ్రత్తలు పుచ్చుకున్నాం. కాని మాకు ఏ విధమైన వర్తమానం రాకముందే పత్రికల్లో రాష్ట్రపతిగారి "స్టే" "ఉత్తర్వులు చూచి దిగ్భ్రమచెందాను. ఇది చాలా చిత్రమైనవిషయం. లిఖితపూర్తి యంశాలు ఏలూరునుంచి పత్రికలలో ప్రచురించబడినవి. ఈ అవకతవకలన్నీ చూడగా, ప్రజలయొక్కయు, కాంగ్రెసు సభ్యులయొక్కయు దృక్పథంలో, రాష్ట్ర కాంగ్రెసువారిని నిర్వీర్యం చేయటమే, ముఖ్యోద్దేశ్యమని వ్యక్తమగుచున్నది."

(స్వ. వి.)

# సెనేటుకు కడప ప్రతినిధుల ఎన్నిక

కడప, నవంబరు 28: కడపజిల్లాబోర్డు కడప, ప్రొద్దుటూరు మునిసిపల్ సంఘాల పక్షాన సోమిరెడ్డి కృష్ణమూర్తి శ్రేష్ఠిగారు (75 వోట్లు) సి. బావిశెట్టిగారు (72 వోట్లు) ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యులుగా ఎన్నుకోబడినట్లు ప్రకటింప బడెను. (స్వ. వి.)

# "అహింసామార్గమే జయిస్తుంది"

## గాంధీతత్వం విశిష్టత: మైకేల్‌స్కాట్ దృఢవిశ్వాసం

న్యూయార్కు, నవంబరు 29: నైరృతి ఆఫ్రికా జాతులతరపున శనివారం నాడు ధర్మకర్తృత్వ సంఘం ఎదుట మాట్లాడిన రివరెండ్ మైకేల్‌స్కాట్ ఈవేళ పి. టి. ఐ. విలేఖరితో మాట్లాడుతూ ముందు నెలలో తాను ఇంగ్లండు వెళుతున్నాననీ, ముందు సంవత్సరం ప్రారంభంలో తిరిగి దక్షిణాఫ్రికాకు మరలిపోగలననీ అన్నారు.

ఆయన ఇంకా ఇలాగ అన్నారు. "నైరృతి ఆఫ్రికా సమస్యవిషయంలో పరిస్థితులు గమనించటానికి నేనింకా లేక్ సక్సెస్‌లోనే ఉంటాను. ముందు నెలలో నేను ఇంగ్లండులో అనేకచోట్ల మాట్లాడవలసి ఉన్నది. ఆతరువాత నేను దక్షిణాఫ్రికా వెళతాను. నైరృతి ఆఫ్రికా విషయంలో మీరు చేస్తున్న ప్రచారంవల్ల దక్షిణాఫ్రికా తిరిగి వెళ్ళటానికి ఇబ్బందు లేమైనా ఉన్నాయా అని అడగగా అట్లాంటి ఇబ్బంది లేవీ లేవని స్కాట్ అన్నారు.

ఈవిషయంలో ఆయన ఇంకా ఇలాగ అన్నారు. "అయితే దక్షిణాఫ్రికాలో చాలామందికి ఈ సమస్య సమగ్రస్వరూపం తెలియదు. అక్కడి వారిలో చాలమందికి కేవలం పశుబలం మీదనే విశ్వాసంవున్నది. ఎప్పటికైనా దక్షిణాఫ్రికావాసులు ఈసమస్యను అర్థం చేసుకుతీరాలి."

ఆయన ఇంకా ఇలాగ చెప్పారు. ఈ సమస్యాసాధన విషయంలో మహాత్మాగాంధీ మనకొక మహోత్తమమార్గం చూపించారు. మహాత్మాగాంధి గొప్పతనమహోపదేశా లింకా మనంపూర్తిగా అవగాహన చేసుకోలేదు. అసలు మహాత్మాగాంధీ అహింసాతత్వం దక్షిణాఫ్రికాలోనే ఉద్భవించింది, ఆ తత్వం భారతదేశంలో జయించింది. అలాగే అది దక్షిణాఫ్రికాలోకూడా జయించకలదని నా విశ్వాసము. శాంతిసాధనకు గాంధీజీ చూపించిన మార్గము — అందులోనూ దక్షిణాఫ్రికాలో శాంతిసాధనకు గాంధీజీ చూపించిన మార్గము చాలామహోత్తమమైనది. దక్షిణాఫ్రికాలో జాతివిద్వేషము, దురహంకారము చాలా ఎక్కువగా ఉన్నాయి. ఇక్కడ గాంధీజీ సత్యాగ్రహమార్గం అవలంబించడంవల్ల చాలామంచి ఫలితాలు కలుగుతాయని నా విశ్వాసము. మేము కేవలం గాంధీసత్యాగ్రహ పద్ధతిమాత్రమే కాక ఆయన ఆదర్శాలన్నీ సంపూర్ణంగా అవలంబించ దలచుకున్నాము. క్రైస్తవ తత్వము, గాంధీతత్వము, ఇంచుమించుగా ఒకటే అని నా అభిప్రాయము. గాంధీజీ సత్యాగ్రహ దర్శనంలో నాకు సంపూర్ణమైన విశ్వాసంఉన్నది. గాంధీజీలో నిజమైన ఆధ్యాత్మిక తత్వంకూడా ఉన్నది"

రివరెండుస్కాట్ త్వరలో ఇండియాలో జరగబోయే ప్రపంచశాంతి సమావేశాన్నిగురించి ప్రస్తావిస్తూ, దానికి తమకు ఆహ్వానంవచ్చిందనీ, ఆ సమావేశానికి హాజరు కాదలచుకున్నాననీ చెప్పారు.

### హోల్మ్స్ జోహార్లు

న్యూయార్కు, నవంబరు 28:— న్యూయార్కు, కమ్యూనిటీ చర్చిలో మతాచార్యులుగా ఉంటున్న రివరెండు జాన్ హేనస్ హోల్మ్స్ ఈవేళ మాట్లాడుతూ గాంధీజీ తమకు ఆదర్శపాత్రులైన ఋషిఅనీ, ద్రష్టఅనీ ప్రస్తుతించారు.

రివరెండు హోల్మ్స్ అనేకమైన ప్రజాహితోద్యమాలలో పాల్గొంటూ మొదటినించీ భారత స్వాతంత్ర్యోద్యమానికి చేయూత ఇస్తూ ఉండేవారు. తమ అభిప్రాయాలను మార్చిన మహాపురుషులలో గాంధీజీ ఒకరని ఆయన చెప్పారు. గాంధీజీనీ గురించి ఆయన ఇంకా ఇలాగ అన్నారు. "గాంధీజీ నాకు ఆదర్శభూతులైన ఋషి. ద్రష్ట. ఆయన వల్ల నాకు, ఆత్మ ప్రశాంతి, జీవిత ప్రశాంతి కలిగాయి. ఇవిన్నాలో జీవితాంతమువరకుండి పోతాయి గాంధీజీ మృతితో నాలోని ఆశాజ్యోతి అంతరించినట్లైనది."

అకిమ్మటు హోరింగ్టను భారత శాస్త్రవేత్తనై, సుబ్బారావు చే ఇంతకు పూర్వం సమర్పింపబడిన ఒక వేదికకు అవిష్కారణోత్సవం జరిపారు. కమ్యూనిటీ చర్చి అధ్యక్షులు ఆ వేదికను కృతజ్ఞతా వందనాలతో స్వీకరించారు.

# తూ. గో. స్థానికసంస్థల సెనేట్ ప్రతినిధి ఎన్నిక

రాజమండ్రి, నవంబరు 27: తూర్పు గోదావరి జిల్లా స్థానిక సంస్థల తాలూకు సభ్యత్వ స్థానమునకు ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యుడుగా పెద్దాపురం మునిసిపల్ కౌన్సిలర్ .........రావు గారు ఎన్నుకోబడ్డారు.

# 'నైజాం ధనం అపహరించిన నవాబ్ మోయిన్ జంగ్‌పై కోర్టు చర్య'

## అధివేశశాసనసభలో ప్రశ్నకు సంస్థానశాఖామంత్రి సర్దార్ పటేల్ సమాధానం

న్యూఢిల్లీ, నవంబర్ 29: ఈవేళ భారత అధివేశ పార్లమెంటులో శ్రీ బి. యస్. మునవల్లిగారి ప్రశ్నకు సమాధానంగా సంస్థానశాఖామంత్రి సర్దార్ వల్లభాయ్‌పటేల్ వ్రాతమూలకంగా ఈ వివరాలు తెలియజేశారు.

హైదరాబాదు నవాబు సంస్థాన మాజీ ఖజానామంత్రి నవాబ్ మోయిన్‌నవాజ్‌జంగ్ కుకొంతడబ్బువప్పగించ చేశారు. ఈ మొత్తాన్ని లండన్‌లోని నాటి హైదరాబాదు యేజంటుజనరలు బార్క్లే బ్యాంకులోన వాజ్‌జంగ్, జహీర్ అహమ్మదులజాయింటు ఖాతాకు ట్రాన్సుఫర్ చేయించారు. ఈ మొత్తాన్ని తిరిగి రాబట్టుకోటానికి హైదరాబాదు నవాబు నవాజ్‌జంగ్‌గారి మీద కోర్టు వ్యవహారం జరుపుతున్నారు.

### ఐ. సి. ఎస్., ఐ. పి. ఎస్

ఇ. సి. యస్. ఉద్యోగులలోనూ, ఐ. పి. యస్. ఉద్యోగులలోనూ, చివరిమనిషి పదవీ విరమణ కావటం 1979 లో జరుగుతుంది. పౌరపరిపాలనాశాఖలో ఐ. సి. యస్. ఉద్యోగులు 422 మందీ, రాజకీయ పరిపాలనాశాఖలో 7 గురు, వుండేవారు పోలీసు శాఖలో ఐ. పి. యస్. ఉద్యోగులు 162 వుండేవారు.

1947, 1948 సంవత్సరాలలో ఐ. ఏ యస్. పరీక్షలకు 8, 645గురు అభ్యర్థులూ ఐ. పి. యస్. పరీక్షకు 2,800 మందీ హాజరయ్యారు. వీరిలో ఐ. ఏ. యస్. వారిని 70 మందినీ, ఐ. పి. యస్. వారిని 68 రనూ తీసుకున్నాం. వీరుకాక అత్యవసర శాఖక్రింద ఐ. ఏ. యస్. లను 81 మందినీ, ఐ. పి. యస్. లను 39 మందినీ తీసుకున్నాం.'

### ఢిల్లీలో మద్యనిషేధంవల్ల ఆదాయం తగ్గుదల

ఢిల్లీ మద్యనిషేధ కార్యక్రమాన్ని గురించి హోమ్ మినిస్టర్ సర్దార్ పటేల్ ఇలా వివరించారు:

'ఢిల్లీలో మద్యనిషేధ కార్యక్రమాన్ని పరిమితంగా అమలు జరిపాం. ఇందువల్ల ప్రభుత్వానికి వచ్చే ఆదాయంలో 20 లక్షలు తగ్గిపోయింది. ఈ మొత్తాన్ని యితరపన్నులు విధించి రాబట్టటానికి ప్రయత్నించుచున్నాం. సంపూర్ణ నిషేధకార్యక్రమాన్ని అమలుజరపటానికి యింకా తేదీ యేదీ నిర్ణయించలేదు ఈ నిషేధ కార్యక్రమాన్ని క్రమంగా అభివృద్ధి చేయటం జరుగుతుంది.

### నేషనల్ కాడెట్ కోర్

'నేషనల్ కాడెట్‌కోర్' అనే పేర కళాశాలలలోనూ పాఠశాలలలోనూ సైనిక శిక్షణ పొందుతూన్న విద్యార్థిదళాలు మొత్తం 56,900 వున్నారు. వీరిలో 19,746 మంది సీనియర్ దళాలకు చెందినవారు, 37,154 మంది జూనియర్ దళాలకు చెందినవారు.

ఈ కార్యక్రమం, హైదరాబాదు, పాటియాలా, తూర్పుపంజాబ్ సంస్థాన సమాఖ్య, కాశ్మీరులలో నూ మినహా, తక్కిన అన్ని రాష్ట్రాలలోనూ, సంస్థానాలలోనూ అమల్లోవుంది. పాటియాలా తూర్పు పంజాబ్ సమాఖ్య యీ కార్యక్రమాన్ని 1950 లో ప్రారంభించుతుంది. స్త్రీలశాఖగా కలకత్తా, నాగపూర్, లూధియానాలలో మూడు దళాలు ప్రారంభించాం. ప్రస్తుతం పరిశీలనార్థం ఈ మూడు దళాలకు శిక్షణనిస్తున్నారు ఇవి ప్రయోజనకరంగా వున్నాయనితోస్తే ఈకార్యక్రమాన్ని తక్కిన ప్రాంతాలలో కూడా ప్రారంభించటం జరుగుతుంది. ఈ కార్యక్రమము ంతాక శాలలలోనూ, పాఠశాలలలోనూ జరుగుతున్న కారణంగా దాన్ని అఖిల భారత మహిళాసంఘపు అనుబంధ కార్యక్రమంక్రింద మార్చాలనే ప్రసక్తిరాదు.

### హైదరాబాదులో సైన్యంలో వుండిపోయిన పాత ఉద్యోగులు

'పోలీసుచర్యలకు ముందు హైదరాబాదు సైన్యంలో పనిచేసినవారిలో ఇంకా ఎంతమంది సంస్థానసైన్యంలో నిలచివున్నారు' అని కామత్‌గారు వేసినప్రశ్నకు సమాధానంగా సర్దార్ పటేల్ ఇలా అన్నారు.

'మీరు లోగడ వేసిన ప్రశ్నకు ఇది అనుబంధప్రశ్నగాదు. మీరు లోగడ అడిగినప్రశ్న, హైదరాబాదు మాజీ సర్వసేనాని ఎల్‌ఎద్రూస్ ఉద్యోగాన్నిగురించి ఆయన 1949 అక్టోబరు 1 వ తేదీన ఉద్యోగం విరమించుకున్నారు.'

# ఈజిప్టులోని బ్రిటిష్ సేనల ఉపసంహారం?

## అమెరికా ఆమోదించినట్లు ఈజిప్ట్ పత్రిక వార్త

కెయిరో, నవంబర్ 29: "ప్రస్తుతం ఇస్తంబూల్‌లో రహస్యసమావేశం జరుపుతున్న మధ్యప్రాచ్యదేశాలలోని అమెరికన్ ప్రతినిధులు బ్రిటిష్‌సేనలు ఈజిప్టునుంచి ఉపసంహరించుకోవచ్చునని ఆమోదించారు' అని ఈజిప్టు వార్తాపత్రిక 'అల్‌మిస్రీ' ప్రత్యేక విలేఖరి నేడు వెల్లడించాడు.

1936 సం॥పు ఆంగ్లో ఈజిప్షన్ ఒడంబడికను సవరించాలని ఈజిప్టు 1946 లో బ్రిటన్‌తో జరిపిన సంప్రదింపులలో ముఖ్యాంశం బ్రిటన్ తనసేనలను, ఉపసంహరించుకోవటమే. ఈ సంప్రదింపులు 1947 జనవరిలో భగ్నమైనవి.

ఇస్తంబూల్ సమావేశంలో ఈక్రింది నిర్ణయాలుకూడా చేయబడినవని ఆ విలేఖరి వ్రాశాడు:

(1) అరబ్ రాజ్యాలతో బ్రిటిష్ స్నేహసంబంధాలు అభివృద్ధి కావాలి.

(2) అరబ్ దేశాలు సమిష్టి రక్షణ ఒడంబడికను చేసుకుని కమ్యూనిస్టు వ్యతిరేక కూటమిని నెలకొల్పాలి.

(3) ఇస్రేల్-అరబ్ దేశాలమధ్య శాశ్వత సంధి ఒడంబడికకు తీసుకోవలసిన అవసర చర్యలు.

(4) ఇరాక్-సిరియాల ఆర్థికసమాఖ్యగా ఏర్పడవచ్చునే కాని రాజకీయ సమాఖ్యగా ఏర్పడకూడదు.

(5) మధ్యప్రాచ్యంలో బ్రిటిష్,అమెరికన్ పెట్రోలు గనులను కాపాడటానికి తీసుకోవలసిన చర్యలు.

(6) మధ్యప్రాచ్యదేశాల్లో అమెరికా పెట్టుబడితో నిర్వహించబడే ప్రాజెక్టుల విషయమై సంప్రదించుకొనటానికి ఈజిప్టు అధ్యక్షతన ఒక సంప్రదింపులసంఘాన్ని ఏర్పరచాలి.

# "ఇండియా అమెరికా ఒడంబడిక చర్చలలో ప్రతిష్టంభన రాలేదు"

## వాషింగ్టను ప్రముఖుని అభిప్రాయం

వాషింగ్టను, నవంబరు 28: వాషింగ్టనులో ప్రముఖు లొకరు ఇండియా అమెరికా ఒడంబడిక విషయమై ప్రస్తావిస్తూ ఇండియా అమెరికాలమధ్య ఏర్పడబోయే వాణిజ్యపు ఒడంబడికలో ప్రతిష్టంభన ఏమీరాలేదని, అయితే కొన్ని చిన్న విషయాలలో అభిప్రాయభేదాలు వచ్చాయనీ, వీటి విషయంలో కూడా రాజీ సంప్రదింపులు జరుగుతున్నాయనీ చెప్పారు.

ఇండియాకు విదేశ వాణిజ్యవర్గాలంటే అనుమానమనీ, అందుచేతనే ఇండియా అమెరికాలమధ్యన వ్యాపార నౌకాయానమిత్రత్వ సంధి ఆగిపోయిందనీ కొన్నిచోట్ల ప్రకటింపబడినదనీ, అది అసత్యమనీకూడా ఈ ప్రముఖులు అన్నారు.

ప్రధాన సూత్రాల విషయంలో ఒడంబడిక కుదిరిందనీ, కొన్ని చిన్న విషయాలలోనే ఒడంబడిక కుదరలేదనీ ఈయన చెప్పారు.

ఇండియా అమెరికాల మధ్య ఏర్పడబోయే ఈ సంధి చాలా సమగ్రమైనదనీ, ఇటలీ అమెరికాలమధ్యకూడా ఇంత సమగ్రమైన జరగలేదనీ ఇక్కడి వ్యాపార వర్గాలు భావిస్తున్నారు. ఇండియాకంటె అమెరికా కొన్ని విషయాలలో చాలా గట్టిగా పట్టుదల వహిస్తున్నదనికూడా ఈ వర్గాలవారన్నారు.

భారతప్రభుత్వం తన సర్వస్వతంత్ర ప్రతిపత్తికి అడ్డువచ్చే ఏ చిన్న విషయానికీ కూడా అంగీకరించలేదని తెలుస్తున్నది.

భారతప్రభుత్వం విదేశవాణిజ్య వర్గాలంటే అనుమానంగా చూస్తున్నమాట నిజం కాదట విదేశవాణిజ్యవర్గాలు ఇండియాలో ఈ మధ్యన పెట్టిన పెట్టుబడులను దీనికి దాఖలా అని భారతప్రభుత్వ అన్నదట. అయితే వాషింగ్టను ప్రముఖులు సరిగా ఏ విషయంలో అభిప్రాయభేదం వచ్చిందో చెప్పడానికి నిరాకరించారు అయితే అవి వ్యాపార కార్యకలాపాలకు సంబంధించిన విషయాలై ఉంటాయని అనుకుంటున్నారు.

### అనకాపల్లి

ఈ పట్టణంలోని గ్రంథాలయ అవతరణోత్సవము 27-11.49 ఆదివారము సామంత్రేయ కళాప్రపూర్ణ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి అధ్యక్షతను జరిగెను.

శ్రీ మొక్కపాటి నరసింహ శాస్త్రిగారు, శ్రీమహేశ్వర్‌గారు ఉపన్యసించారు. రాత్రి 9 గంటలకు కొందరు అరుణాట్యకళాకేంద్రము వారి ప్రదర్శక నాట్యము వారిచే ప్రదర్శింప బడెను.

# రాయలసీమకు బలమైన నాయకత్వం కావాలి

## లేకుంటే వారిమాట నెగ్గదని పుల్లారెడ్డిగారి హెచ్చరిక

కడప, నవంబర్ 28: "ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సమావేశము యిటీవల విజయవాడలో జరిగినప్పుడు హాజరైన రాయలసీమ సభ్యులు కోస్తా జిల్లాలవారి మాటకు ఓటమి పోయి రాయలసీమ అవసరాలనుగూర్చి, మాట్లాడకపోవటం శోచనీయమని కొందరు భావించటం పొరబాటు. రాష్ట్ర కాంగ్రెసులో కోస్తాజిల్లాలవారు అధికసంఖ్యాకులు. రాయలసీమవారు బహుకొద్దిమంది. వారేమి చేయగలరు? తమమాట నెగ్గదని వారికి బాగా తెలుసు. శ్రీబాగ్ ఒడంబడిక షరతులను రాష్ట్ర కాంగ్రెసు వారు మన్నిస్తారనే నమ్మకంలో మర్యాద కొద్దీ తమ వ్యతిరేకతను వారు వెలిబుచ్చలేదు" అని కడపజిల్లాబోర్డు అధ్యక్షుడు టి. పుల్లారెడ్డిగారు నేడు చెప్పారు.

రెడ్డిగారి గౌరవార్థం కమలాపురవాసులిచ్చిన సన్మానసందర్భంలో ఆయన ఇంకా ఇల్లా అన్నారు.

"ఇప్పటికి మించి పోయినదేమీ లేదు. రాయలసీమలోని కాంగ్రెసు వారు, కాంగ్రెసేతరులు అంతర్విభేదాలను కట్టిపెట్టి ఏకగ్రీవంగా, మంత్రివర్గం సమాన ప్రాతినిధ్యం, రాజధాని, హైకోర్టు, ప్రత్యేక విశ్వవిద్యాలయం, ప్రాజెక్టులు, ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెసు మున్నగునవి రాయలసీమకు ఏర్పాటు చేయాలని రాష్ట్రపతి పట్టాభిగారిని, అ. రా. కాం. అధ్యక్షుడు ఎన్. జి. రంగాగారిని గట్టిగా ఒత్తిడిచేసి అడగాలి. వారు దీనికి అనుకూలించగలరనే నానమ్మకం. ఏమైనా వారిని పరీక్షింపవచ్చునుగదా.

మన బలహీనతకు కారణం రాయలసీమలో సరియైన నాయకత్వం లేకపోవుట. ఇప్పటికైనా దీన్ని గ్రహించి, వారు ఏకనాయకత్వము నేర్పరచుకోవాలి. రాయలసీమ మహాసభ, మహాజనసభలు తమ విభేదాలను మరచి, ఏకమై త్వరలో ఒకసమావేశం జరిపి మనసీమ భవిష్యత్తును గూర్చి నిర్ణయించుకోవలసిన అవసరము వున్నదని విజ్ఞప్తిచేస్తున్నాను'

జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు పి. బసిరెడ్డిగారు సభకధ్యక్షత వహించారు.

స్వ. వి.

# ఐక్య కేరళ స్థాపనకై ఢిల్లీకి రాయబారం

## పటేల్ నెహ్రూలతో సంప్రతింపులు

న్యూఢిల్లీ, నవంబరు 29: కేరళంనుంచి ఒక రాయబారవర్గం ఇక్కడికి వచ్చింది. ఈ రాయబారవర్గం ఐక్యకేరళ నిర్మాణ విషయంలో కాంగ్రెసు అధిష్టానవర్గానికి సంస్థాన మంత్రివర్గానికీ ఒక నివేదిక సమర్పింప బోతున్నదని తెలుస్తున్నది.

ఈ రాయబారవర్గం భారత ప్రధాన మంత్రి పండిత నెహ్రూను, ఉపప్రధాన మంత్రి వల్లభాయ్‌పటేల్‌నుకూడా సందర్శింపగలరని తెలుస్తున్నది.

వీరి నివేదికలో మలబారును, ఇంకా మళయాళం మాట్లాడే కాసర్‌గోడ్ గూడలూర్ తాలూకాలనుకూడా కేరళంలో కలపవలసిందని కోరబోతున్నారని తెలుస్తున్నది. మలబారును, గూడలూర్‌ను, తిరువాంకూర్ కొచ్చిన్ యూనియన్‌లో కలపాలని వీరి కోరిక. దీనితో ఐక్యకేరళం పూర్తి అవుతుంది.

ఈ రాయబారవర్గాన్ని ఐక్యకేరళ సంఘం పంపించింది. వీరి విషయంలో అప్పుడే సంస్థానశాఖా కార్యదర్శి ఎమ్. కె. వెల్లోడిగారితో కొంతవరకు సంప్రతించారని తెలుస్తున్నది.

ఈ రాయబార నాయకులు కె. పి. కేశవమీనన్ సంస్థానశాఖా సలహాదారు వి. పి. మీనన్‌తో అప్పుడే ఈ విషయంలో సంప్రతించారట.

ఈ రాయబారవర్గం ఈవేళ కాంగ్రెసు అధ్యక్షులు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారిని, కాంగ్రెసు కార్యదర్శి శంకరరావ్ దేవ్‌గారిని కలుసుకుని తమ రాయబారవిషయం వారికి నివేదించారట. ఈ రాయబారవర్గంలో నారాయణమీనన్ మాధవన్ నాయర్ ప్రభృతు లున్నారని తెలుస్తున్నది.

# బళ్లారి విభజన విరోధ సభ

## నిందా వాక్యములు వినికూడా ఆంధ్రుల ఓరిమి

ఆదోని, నవంబర్ 28: నిన్నటి దినం ఇచ్చట బళ్లారి జిల్లా విభజన విరోధ సభ శ్రీ. గాదిలింగన గౌడ్ గారి అధ్యక్షతన జరిగింది. శెంగురప్పారు వాస్తవ్యులైన అ. న. కృష్ణరావు గారు, ఇంకా తదితర కర్నాటక అభిమానులు ప్రసంగించారు. ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలను ఆంధ్ర రాష్ట్రంలో ఎన్నటికీ చేర్చనివ్వరాదని వారు ఉద్రేక పూరితులై మాట్లాడారు. జె. వి. పి. రిపోర్టును, కాంగ్రెసు కార్యవర్గ తీర్మానమును నిరసిస్తూ, ద్వేష, నిందాత్మకమైన భాషలో మాట్లాడారు. జె. వి. పి. నివేదికను ఆంధ్రనాయకు లామోదించినందున, సభలో ఆంధ్రులు అధిక సంఖ్యలో ఉన్నప్పటికీ శాంత చిత్తులై సహించారనీ కన్నడుల విడిపోవడం అందరికీ కష్టం కలిగిస్తున్నదని, ఆంధ్రుల శాంతమునందరూ మెచ్చుకున్నారనీ బళ్లారి జిల్లా కాంగ్రెసు కార్యదర్శి వెంకటేశ్వరరావు గారు తెలియజేస్తున్నారు.

హాజరైన సుమారు 300 మంది సభికులలో తమకు కర్నాటకం కావలసినవారు చేయిఎత్తమని కోరగా, ఎవ్వరూ చేయిఎత్తలేదు.

ఈ సభకు క్రిందటిరోజున ఊరిలో అచ్చటచ్చట ఆంధ్రులను నిందిస్తూ అసభ్యపు వ్రాత పత్రములు కొన్ని అంటించబడినవి. (స్వ. వి.)

# గ్రామసేవక విద్యాలయం

ప్రొద్దుటూరు, నవంబరు 29: అనంతాశ్రమం నిర్వహణ కర్త వి. వీరబ్రహ్మంగారిట్లు తెలియజేస్తున్నారు.

గ్రామసేవక విద్యాలయం డిశంబరు నెలలో ప్రారంభించి ఒకమాసము నడుపుతాము. గ్రామసేవకు కావలసిన తర్ఫీదు యివ్వబడును. నూలు వడకుట, నేయుట, వడ్రంగము, కమ్మరము, కుమ్మరము, పేదరపని, చర్మకారవృత్తి గురించి విజ్ఞానము దృష్టాంత రూపముగా నేర్పబడును. ఇందులో దేనియందైనా ప్రత్యేకాసక్తి గల వారికి కొంత అనుభవ పూర్వకమైన జ్ఞానము కలుగజేయబడును గ్రామపారిశుధ్యము, గ్రామారోగ్యము, గ్రామ పాఠశాలలు ముఖ్యముగా బేసిక విద్యావిధానము, గ్రామ పంచాయతులు, గ్రామసహకార సంఘాలు, గ్రంథాలయాలు, వయోజన విద్యాలయాలు గ్రామ వ్యవసాయ సమస్యలు. గ్రామపరిశ్రమలు వీటికి సంబంధించిన జ్ఞానము కలుగుటకు తగినశిక్షణ యివ్వబడును.

ఇందు చేరదలచినవారు డిసెంబరు 7 వ తేదీలోగా ఆనందాశ్రమము వయా, మైదుకూరు, కడపజిల్లాకు వ్రాసి దరఖాస్తులు పొందవచ్చును (స్వ వి.)

ప్రకటన

# ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

ఇపుడు నెం 1, 2 కలకత్తా మెయిల్సులో, ఒకటి, రెండు, మూడవ తరగతి పెట్టెలతో నడచుచున్న మద్రాసు-హైదరాబాద్ త్రూ బోగి 1-12-1949 నుండి నెం. 3, 4 గ్రాండ్ ట్రంకు ఎక్సుప్రెస్సులలో నడచును. అదే తేదినుండి, మద్రాసు-హైదరాబాద్ మధ్య ఒక త్రూ 3-వ తరగతి బోగీ గూడ, గ్రాండ్ ట్రంకు ఎక్సుప్రెస్సులలో ఏర్పాటుచేయబడును.

టెండరు నోటీసు

ఎం. అండ్ ఎస్. ఎం; ఎస్. ఐ. రైల్వేల గ్రెయిను షాపులకు సరకుల సప్లయి నిమిత్తము టెండర్లు

గ్రెయిను షాపులకు దిగువ సరుకులు సప్లయి చేయుటకు, ఒక్కొక్క రైల్వేకు ఒక్కొక్క సరుకుకు విడివిడిగా టెండర్లు, ఛేర్మన్, జాయింట్ పర్చేజింగు బోర్డు, సదరన్ గ్రూప్ C/o సూపరింటెండెంటు (G. S) ఎం. అండ్ ఎస్. ఎం, రైల్వే; పార్కు టౌన్, మద్రాసు వారిచే 21-12-1949 తేది మధ్యాహ్నము 3 గంటల వరకు తీసికొనబడును.

2. ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే గ్రెయిన్ షాపులకు కావలసిన సరుకులు:

(1) కందిపప్పు
(2) మినపపప్పు
(3) నువ్వుల నూనె
(4) ఉప్పు

3 ఎస్. ఐ. రైల్వే గ్రెయిన్ షాపులకు కావలసిన సరుకులు:

(1) కందిపప్పు
(2) మినపపప్పు
(3) నువ్వుల నూనె
(4) కొబ్బరి నూనె
(5) ఉప్పు.

4. టెండర్లు పెట్టదలచినవారు తమ టెండర్లను నిర్ణీతఫారములో పంపవలెను. ఫారము ఖరీదుక్రింద (ఒక్కొక్క రైల్వేకు ఒక్కొక్క సరుకుకు) రు 1 వంతున మద్రాసు పార్కు టౌన్, ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే పే-మాస్టరు అండ్ కాషియరుకు చెల్లించి, దినవ వంతకముదారు ఆఫీసునుండి షెడ్యూలు, స్పెసిఫికేషనుతోసహా టెండరు ఫారము పొందవచ్చును. టెండరు ఫారము ఒకరిది మరియొకరికి మార్చుకొనగూడదు. దాని ఖరీదు వాపసు చేయబడదు.

నోటు:- ఎం. అండ్ ఎస్. ఎం; ఎస్. ఐ; బి. ఎన్. రైల్వేల ప్రాతినిధ్యముగా జాయింటు పర్చేజింగ్ బోర్డువారి తరపున ఈ టెండరు, సూపరింటెండెంటు (GS) ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వేవారిచే కోరబడుచున్నది. ఏ టెండరైనను అంగీకరించబడిన తరువాత, గెలుపొందిన టెండరుదారు, ఆయా రైల్వేకు సంబంధించిన ఆఫీసరు ఇన్‌చార్జి (జి. ఎస్.) గారితో కంట్రాక్టు వ్రాసుకొనవలసి యున్నదను విషయము టెండరుదారులు స్పష్టముగా తెలిసికొనవలెను.

చేర్మన్,
జాయింట్ పర్చేజింగ్ బోర్డు,
(ఎం. & ఎస్. ఎం., ఎస్. ఐ; బి. ఎన్ రైల్వేలు) జనరల్ మేనేజరు ఆఫీసు,
(జి. ఎస్.) ఎం అండ్ ఎస్. ఎం. రైల్వే,
పార్కు టౌన్, మద్రాసు, 29-11-49.

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర శు ఏకాదశి 1949 సం॥ డిసెంబరు 1 గురువారం శు ఏకాదశి ప12 4 శే సా4 56 స్వ్రం ఫేచ. శు॥ ద్వాదశి డిసెం॥ 2 శుక్రవారం శు॥ ద్వాదశి ప 2 45 అశ్వ రా 7-59 వ్య్రం ప 3-29 ల 5-17 వ.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ మార్గశిర శు ఏకాదశి గురువారం

## కేంద్ర హోంశాఖ కార్యదర్శి లేఖ

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ వ్యవహారము తిరిగి మొదటికే వచ్చినది. నూత్న రాజ్యాంగము అమలుజరుగుటతో బాటు జనవరి 26 న ఆంధ్ర రాష్ట్రము అవతరింపగలదను ఆశ, విశ్వాసములతో ఆంధ్రనాయకులు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము అన్యాయమైనట్టి షరతులున్నను నాయకత్రయ నివేదికను ఆమోదించి యుండెను. కాంగ్రెస్ కార్యవర్గముకూడ ఆంధ్ర, తమిళ కాంగ్రెస్ సంఘముల తీర్మానములను, చెన్నరాష్ట్ర ప్రభుత్వసమాధానమును పరిశీలించి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమునకు శీఘ్రచర్యలు తీసుకొనవలెనని కేంద్రప్రభుత్వమునకు సూచించియుండెను. అటు పిమ్మట భారతప్రభుత్వము కార్యవర్గ తీర్మానమును పురస్కరించుకొని సాధ్యమైనంతత్వరలో ఆంధ్ర రాష్ట్రనిర్మాణమునకు చర్యతీసుకొనుటకు నిర్ణయించుకొనెను. కాని ఈ వారము కేంద్ర ప్రభుత్వ హోంశాఖా కార్యదర్శి చెన్నరాష్ట్రప్రభుత్వమునకు పంపిన దీర్ఘ లేఖనుబట్టి 1950 జనవరి 26 వ తేదీన ఆంధ్రరాష్ట్ర అవతరణ సాధ్యముగాదని తోచుచున్నది. విభజన సావధానముగ, సంపూర్ణముగ జరుగుట అందరికి శ్రేయస్కరమే. కాని ఈ విభజన కలాపము నిర్ణయించు సందర్భమున ఆంధ్ర-చెన్నరాష్ట్ర విభజనను పంజాబ్, బెంగాల్ విభజనలతో పోల్చుట సబబుగాదు; సమంజసముగాదు. ఆ రాష్ట్రముల విభజన భారత-పాకిస్తాన్ విభజన కేవలము 'తెగతెంపుల' ధోరణిలో జరిగెను. అట్టివిభజన కలాపమునకు ఇదివరకు జరిగిన సాదృశ్యములు లేనందున ఇప్పటికిని అనేక సమస్యలు పరిష్కారము గాకున్నవి. అట్లు పరిష్కారము గాక నిలచిపోయిన సమస్యలలో ముఖ్యమైనవి కాందిశీకుల ఆస్తులకు సంబంధించినవి; పంజాబులోని నదీజలముల పంపకమునకు సంబంధించిన సమస్యలు మాత్రమె. అట్టి సమస్యలు ఆంధ్రరాష్ట్ర-చెన్న రాజధాని విభజన సందర్భమున ఉత్పన్నము కావనియె ఆశింపవచ్చును.

ఉభయులు సమాధానవైఖరిలో, సామరస్యధోరణిలో వ్యవహరించిన భారతప్రభుత్వ హోంశాఖా కార్యదర్శి ఏకరువు పెట్టిన సమస్యలలో పరిష్కారమునకు లొంగని విషమసమస్య లేవియు ఉన్నట్లు కన్పింపదు. ఇండియా-పాకిస్తాన్‌ల విభజనకు ఎంత వ్యవధి పట్టినది? రాష్ట్ర ఆదాయవ్యయముల వివరములు జిల్లాలవారిగ సిద్ధముగ నున్నవి. ఆస్తుల, అప్పుల వివరములుకూడ సిద్ధముగ నున్నవి. హైకోర్టు విషయములోను, రాజధాని నిర్ణయం విషయములోను మాత్రమె సమాధానము కుదరవలసియుండును. రాజధాని విషయములో సమాధానము కుదరకపోయిన కేంద్ర ప్రభుత్వము పూర్వాపరములను విచారించి తీర్పు నివ్వవచ్చును. అట్టి తీర్పుకు అందరు బద్ధులుగాక తప్పదు.

ఇంక ఆస్తి, అప్పుల పంపకము విషయమున సింధు విభజన సందర్భపు సూత్రములను అనుసరించవచ్చును. ఆ సూత్రములను ఇరుపక్షములవారు అంగీకరించిన విభజన విషయమున చిక్కులుండవు. ఆ సూత్రముల ప్రకారము విభజన జరుగుటకు ఎక్కువ వ్యవధికూడ అవసరములేదు. ఈ వివరములు హెచ్. వి. ఆర్. అయ్యంగార్ సూచించినట్లు రాష్ట్రనిర్మాణము ఏ చట్ట ప్రకారము జరిగినను, ముందుగనె నిర్ణయము కావలసియున్నందున వెంటనే వివిధ సమస్యలు పరిష్కారమైన సె. 290 ప్రకారమె సులభముగ ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగగలదు. క్రొత్త రాజ్యాంగమునను సరించి రాష్ట్రనిర్మాణము ఇంత సులభముగాదు. కనుకనె కాంగ్రెస్ కార్యవర్గము, భారత ప్రభుత్వము పరిషత్తు రాజ్యాంగరచనా సంఘముకూడ రాష్ట్రనిర్మాణము సె. 290 ప్రకారము జరుగవలెనని స్పష్టము చేయుచుండెను.

భారత ప్రభుత్వ హోంశాఖా కార్యదర్శి లేఖ ఎంత నిష్పాక్షికముగ నున్నట్లు కన్పించినను, అందు తాత్కాలిక రాజధాని విషయమున తమిళనాయకుల అభిప్రాయమును మాత్రమే పేర్కొని ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానమును పేర్కొనకుండుట సబబుగ లేదు. రాజధాని నగరమును తత్క్షణము నిర్ణయించుట సాధ్యము గాదని అంగీకరించుచు, తమిళ నాయకుల అభ్యంతరములకు ఆంధ్ర నాయకులేమి సమాధాన మిచ్చెదరని ప్రశ్నించుట సమంజసముగాదు. ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని విషయములో మేమిదివరకు చేసియున్న సూచనలె ఆచరణ యోగ్యములు, సాధ్యములు అని వేరుగ చెప్పనవసరము లేదు.

ఏ సమస్యలు ఎప్పుడు పరిష్కారమైనను, రాష్ట్రనిర్మాణమునకు సంబంధించిన ఉత్తరువులు 1950 జనవరి 26 వ తేదీ లోపున జారీ కావలెను. లేకున్న థార్ కమిషన్ విచారణ, నాయకత్రయ నివేదిక, కాంగ్రెస్ కార్యవర్గ, ఆంధ్ర, తమిళ కాంగ్రెస్ సంఘముల తీర్మానములు వ్యర్థములగును. ఒకవిధముగ పరిష్కారమైపోయిన చెన్నపట్టణ సమస్య, రాష్ట్రసరిహద్దులు తిరిగి క్లిష్టసమస్యలుగ తయారుకాగలవు. జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్రమేర్పడకున్న నాయకత్రయ నివేదిక విషయమై ఇదివరలో ప్రకటించిన సమ్మతిని ఉపసంహరించుకొని యావత్తు పరిస్థితిని పునరాలోచింపవలసియుండును. అట్టి పరిణామము ఎవరికిని క్షేమకరముగాదు. కనుక చెన్నరాష్ట్రప్రభుత్వము, కేంద్ర ప్రభుత్వముకూడ 1950 జనవరి 26 లోపునే ఆంధ్ర రాష్ట్ర మేర్పడుటకు అవసరమైన యావత్తు చర్యలు తీసుకొనవలసియున్నది ఆంధ్రనాయకులును జనవరి 26 లోపున రాష్ట్రమును సాధించుటకు ప్రయత్నించవలెను. కాని తాత్కాలిక రాజధాని విషయమున తమిళుల వాదనను ఎంతమాత్రము అంగీకరింపరాదు.

## నిర్బంధ పొదుపు విధానము

కేంద్రప్రభుత్వము ఋణము నివ్వ నిరాకరించిన కారణముగ చెన్నరాష్ట్రప్రభుత్వము తమ అభివృద్ధి పథకములకు అవసరమైన ధనమును సంపాదించుటకు మార్గముల నన్వేషింపవలసివచ్చెను. ధనాభావకారణముగ ప్రజోపయోగకరమగు పథకలను వేటిని విరమించుట జరుగదని, కేంద్ర ప్రభుత్వము తోడ్పడినను, తోడ్పడకపోయినను రాష్ట్రప్రభుత్వము ఇంతకుపూర్వము ప్రారంభించియున్న ప్రాజెక్టులను కొనసాగించుటకే నిశ్చయమైనదని ఆర్థిక మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారు 'సప్లిమెంటరీ బడ్జట్'పై రాష్ట్ర అసెంబ్లీ జరిపిన చర్చసందర్భమున ప్రకటించిరి.

ప్రజోపయోగమైన పనులను విరమించకుండుటకు, ప్రారంభించిన ప్రాజెక్టులను కొనసాగించుటకు రాష్ట్రప్రభుత్వము తీర్మానించుట హర్షింపతగినదే. కాని ఆ కార్యక్రమముల నిర్వహణకు ఆర్థికమంత్రి అనుసరింప దలచిన మార్గములు మాత్రము అంత ప్రశంసనీయమైనవని చెప్పుటకు వీలులేదు. పదిరూపాయిలు పైన శిస్తు చెల్లించు ప్రతిరైతునుండి అంత మొత్తమును నిర్బంధముగ వసూలుపెట్టి అయిదుసంవత్సరముల అనంతరము మూడు రూపాయిల వడ్డీతో చెల్లించుటకు రాష్ట్ర ప్రభుత్వము నిశ్చయించెనని, ఆ నిర్ణయమును కేంద్రప్రభుత్వము ఆమోదించినదని మొన్నటిదినము పత్రికా విలేఖరులతో సంభాషించుచు ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ప్రకటించిరి. వీరు ఈ విధానమును అనుసరించుటకు సర్వత్ర వ్యాపించియున్న ఒక అపోహ కారణమని చెప్పవలసియున్నది. రైతులు పండించు ధాన్యముధరలు ఎక్కువగ పెరిగినందున గ్రామములందు ధనము విశేషముగ నున్నదను దురభిప్రాయమొకటి ప్రబలినది. కాని నేడు గ్రామములలో నూటికి నలుగు రూపాయిన్నర మొదలు రెండు రూపాయిలవరకు వడ్డీ చెల్లించినను "రూపాయి పుట్టుట" లేదని ఎవ్వరూ గుర్తించినట్లు కన్పింపదు. తక్కువ శ్రేణికి చెందిన రైతులకు నిత్యావసరములకే డబ్బు లేక అవస్థపడుచుండ, దుబారా చేయుటకు వారివద్ద పుష్కలముగ ధనము గలదని భావించుటకు హేతువు యథార్థస్థితి పరిజ్ఞానము లేకపోవుటేనని చెప్పవలసియుండును. దుబారా ఖర్చు లేనపుడు నిర్బంధ పొదుపు విధానమును అమలు జరుపనెంచుటలో అర్థములేదు.

గ్రామములలో కొందరివద్ద ఎక్కువధనము ఉండవచ్చును. అట్టివారిసంఖ్య బహుకొద్ది. వారు భూమిశిస్తుకు రెట్టింపే గాక, ఇంక అధికముగ కూడ చెల్లింపగలరు. కేవలము అట్టివారిని దృష్టియందుంచుకొని ఈ నిర్బంధ పొదుపువిధానమును అమలు జరుపుట ఏవిధముగను సమర్థనీయముగాదు.

పదిరూపాయిలు భూమి శిస్తు చెల్లించువారి ఆదాయము ఎంత ఉండునో ఈ నిర్బంధ పొదుపు విధానమును అమలు జరుపుటకు పూర్వము ఆర్థికమంత్రి తెలుసుకొనవలసి యుండును. సాధారణ పరిస్థితులలోనే గిట్టుబాటు కాని కమతములుగ అయిదు ఎకరముల 'మాగాణి' భూమి పది ఎకరముల 'మెట్ట' భూమి నిర్ధారణ చేయబడి యుండెను. అవసరమైన తిరిగి వివరములను సేకరించి గిట్టుబాటు గాని కమతముల ప్రమాణములను నిర్ణయించి, అట్టి భూఖామందులకు ఈ నిర్బంధ పొదుపువిధానము వర్తింపకుండ చేయవలయును. అట్టి కమతములను శిస్తు చెల్లింపునుండి మినహాయింపవలెనను వాదము సర్వత్ర అంగీకరింపబడియుండ, వారి స్వంతదారుల నుండి భూమిశిస్తునే గాక, నిర్బంధ పొదుపు విధానముక్రింద తిరిగి అంత మొత్తమును వసూలుచేయుటను ఏ ఆర్థిక సూత్రము ప్రకారము సమర్థింప వీలుగాదు.

పదిరూపాయిల భూమిశిస్తు అనిన, అందు భూమిపన్ను, నీటి తీరువ, ఇతర సెస్సులు అన్ని చేరిన మొత్తమో లేక కేవలము భూమిపన్ను మాత్రమో కూడ ఆర్థికమంత్రి స్పష్టము చేయలేదు. ఇట్టి కార్యక్రమమును ప్రారంభింప దలచినపుడు సమగ్రవిచారణ జరుపుటవసరము. ఆర్థిక మంత్రి ప్రాజెక్టులు కొనసాగించవలెనను ఉత్సాహమున ఈ విషయములను విస్మరింపరని, గ్రామముల ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన ఇట్టి చర్యలను తీసుకొనునపుడు విశేషశ్రద్ధ వహింతురని ఆశించుచున్నాము.

## జాతిహత్యను నిషేధిస్తూ సమితి నియమం

### ఇండియా ఆమోదం

లేక్‌సక్సెస్, నవంబరు 29: జాతికి జాతినే హత్యచేసే దుష్కర్మను నిషేధిస్తూ ఐక్యరాజ్యసమితి ప్రతిపాదించిన నియమపత్రంమీద భారతప్రతినిధి సర్ బెనెగల్ నరసింగరావు గారు తమదేశంతరఫున నేడు సంతకంచేశారు. సమితి సహాయ కార్యదర్శి డా॥ ఇవాన్ కెర్నో కార్యాలయంలో సంతకం జరిగింది. ఈ నియమపత్రంమీద సంతకం చేసిన దేశాల్లో ఇండియా 32 వది.

1946 లో సమితి సమావేశంలో ఈ ప్రతిపాదనను చేసిన మూడు దేశాల్లో ను ఇండియా ఒకటి.

20 దేశాలు ఆమోదిస్తే ఈ నియమం అమల్లోకివస్తుంది. ఇప్పటికి ఆస్ట్రేలియా, ఇథియోపియా, నార్వే, ఐస్లండ్‌లుమాత్రం ఆమోదించినవి.

## జనాభా లెక్కల తయారీ

న్యూఢిల్లీ, నవంబరు 29:— క్రొత్తగా తయారు చేయబడే జనాభా లెక్కలు కేవలం షెడ్యూల్డు తరగతుల జాబితాలు మటుకే తయారు చేస్తారు. ఆయా రాష్ట్రాలలోని షెడ్యూల్డు తరగతుల వారి సంఖ్యనూ ఇంకా వెనుకబడినవారి సంఖ్యనూ, తెలుపవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాలకు ఉత్తరువులు వెళ్లినవి అని సర్దార్ పటేల్ మరొక ప్రశ్నకు సమాధానమిచ్చారు.

## కాందిశీకుల ఆస్తి

కాందిశీకుల ఆస్తి వ్యవహారాల సమస్యకు సంబంధించి పార్లమెంటులో అడిగిన కొన్ని ప్రశ్నలకు సమాధానంగా కాందిశీక శాఖామంత్రి మోహన్ లాల్ శాక్సేనా యీ దిగువ వివరాలు తెలియజేశారు:—

కరాచీ ఒడంబడిక్రింద, 1949 సెప్టెంబర్ నెలాఖరు వరకూ జరిగిన ఆస్తిమార్పిడి వ్యవహారాలు 28 మాత్రమే. అంతటితో ఆ ఒడంబడిక భగ్నమైపోయింది. ఈ ఒడంబడిక సరిగా నిర్వహించటానికి వీల్లేకుండా పాకిస్థాన్ అధికారులు అనేక ఆటంకాలు కలిగిస్తూ వచ్చారు.

అందుచేత ఈ వ్యవహారాలన్నీ ప్రభుత్వ బాధ్యతల ద్వారా పరిష్కారమైతే తప్ప లాభంలేదని భారతప్రభుత్వం అభిప్రాయపడ్డది. ఉభయప్రభుత్వాల ప్రతినిధులతోనూ యేర్పాటైన ప్రత్యేక సంఘం ద్వారా తప్ప ఈ కార్యక్రమాన్ని మరో విధంగా నిర్వహించటం లాభం లేదు. ఈ విధానాన్ని పాకిస్థాన్ ప్రభుత్వం ఆమోదిస్తుందనే ఇప్పటికీ అనుకుంటున్నాను.' అన్నారు. టిబెట్ నుంచి అభ్యర్థనేమీ రాలేదు.

ఆర్థికంగాగాని, మరే విధంగాగాని సహాయపడమని టిబెట్ ప్రభుత్వం నుంచి అభ్యర్థనేమీ రాలేదు. అని డాక్టర్ కేస్కర్ ఈ వేళ పార్లమెంటులో తెలియజేశారు.

## స్టర్లింగ్ నిల్వల ఒప్పందం విషయమై అధినివేశశాసనసభలో చర్చ: ఆర్థికమంత్రి డా॥ మత్తయి వివరణ

న్యూఢిల్లీ, నవంబరు 29: ఇండియా తాలూకు స్టర్లింగు నిల్వల విషయంలో బ్రిటన్ భారతప్రభుత్వానికి తృప్తికరమైన హామీలు ఇచ్చింది అని నేడు పార్లమెంటులో ఆర్థికమంత్రి జాన్ మత్తయ్ ప్రకటించారు.

పూర్వం ఈ విషయంలో భారతప్రభుత్వం అతి జాగ్రత్తగా వ్యవహరించిందని చెప్తూంటూ ఇకముందుగూడా ఈప్రభుత్వం అరమరిక లేకుండా ఈ విషయంలో వ్యవహరిస్తుంది. స్టర్లింగునిల్వల విషయంలో మన హోదాను నిలుపుకోడానికి ఎటువంటిచర్యలు అవసరమో అటువంటిచర్యలు అవసరమైనప్పుడు తీసుకుంటుంది అని గూడా ఆయన ఈ సందర్భంలో స్పష్టం చేశారు.

స్టర్లింగునిల్వలనుగూర్చిన్నీ, అంతర్జాతీయ బ్యాంకు తాలూకు అప్పు విషయంలోనున్నూ, భారతదేశం చేసుకున్న ఒప్పందాలనుగూర్చి నేడు పార్లమెంటులో చర్చ జరిగింది. ఈ చర్చను ఇవ్వాళ్లటితో ముగించాలని ప్రయత్నం చేశారుగాని అది సాగి వచ్చిందికాదు.

పార్లమెంటులో పెద్దలంతా కలిసికొని ఈ చర్చను 5 గంటలకు ముగించి, 5 గంటల 5 నిమిషాలకు చర్చకు ఆర్థికమంత్రి సమాధానం చెప్పడం ప్రారంభించి 15 నిమిషాలకల్లా ముగించాలనీ, తరువాత పార్లమెంటును వాయిదా వెయ్యాలని నిశ్చయించారుగాని, నేడు పార్లమెంటుకు అధ్యక్షత వహించిన శ్రీ అనంతశయనం అయ్యంగారు 5 గంటలకే పార్లమెంటును వాయిదా వేస్తూ, ఈ విషయాన్నిగూర్చి సంతృప్తికరంగా చర్చ జరిగిందని నేను అనుకోవడంలేదు. చర్చకోసమని దీర్ఘకాలం కొనసాగించాలనుకుంటే దాన్ని రేపు సాగించవచ్చు; లేదా, ఆర్థికమంత్రి తెచ్చిన ప్రతిపాదన ప్రతిపాదనలాగానే వుండిపోతుంది. ఎట్టయినా ఫరవాలేదు అని అన్నారు. ఆ కారణంచేత నేటికి ఈచర్చ అసంపూర్తిగానే వుండిపోయింది.

నేటి చర్చలో శ్రీ బి. దాస్, శ్రీ టి. ప్రకాశం, ప్రొఫెసర్ కె. టి. షా, శ్రీ అజిత్‌ప్రసాద్ జైన్, డా॥ పంజాబ్ రావ్ దేశ్‌ముఖ్, శ్రీ ఏ. సి. గుహ, సర్దార్ భూపేంద్రసింగ్ మాన్ మొదలైన వాళ్లు పాల్గొన్నారు. సాయంత్రం 5 గంటలు అయినతరువాత ఇంకా చాలామంది చర్చలో పాల్గొనవలెనన్న కుతూహలాన్ని వెల్లడిచేశారు.

ఈ చర్చ సందర్భంలో మాట్లాడుతూ డా॥ జాన్ మత్తయ్ ఈలా అన్నారు. గడచిన నాలుగు నెలలలోనూ, ఇండియా చెల్లించవలసిన డాలర్ మొత్తాలకున్నూ, రావలసిన డాలర్ మొత్తాలకున్నూ వుండు కుంటూవున్న తేడా చాలాభాగం తగ్గిపోయింది. అదీకాకుండా రూపాయిమారకం రేటును తగ్గించకపూర్వమే భారతప్రభుత్వం తాను ఇతరులకు ఇవ్వదలిన మొత్తాలను తగ్గిద్దామని కొన్ని అంచనాలుగూడా తయారుచేసింది. ఇప్పుడు మారకం రేటులో మార్పువచ్చిన కారణంచేత దాన్ని ఆఅంచనాలను పునఃవెయ్యవలసి వచ్చింది.

భారతదేశం ఇంతవరకు ప్రపంచబ్యాంకుతో మూడు ఒప్పందాలు చేసుకొని, దాని దగ్గరనుంచి 66 మిలియన్ల డాలర్లు అప్పు తీసుకున్నది. కాని మన ఆర్థిక పరిస్థితినిబట్టి మాస్తే ఇంకా అప్పులుచేసే తాహతు మనకు లేదని రూఢి అవుతుంది. అందువల్ల మనం నిర్వహించదలచుకొన్న అభివృద్ధి ప్రణాళికలు సక్రమంగా పని చేయడానికి, మనం విదేశీ పెట్టుబళ్ళను రానీయవలసి వుంటుంది.

ఆ కారణంచేతనే అటువంటి పెట్టుబళ్లు పెట్టేవారికి మంచి అనుకూలమైన పరిస్థితులు కల్పించడానికి మనం కృషి చేస్తున్నాము. దీనికితోడు ఇతర అంతర్జాతీయ సంస్థల సహాయాన్ని పొందాలని గూడా మనం ఆలోచిస్తున్నాం.

ఇప్పుడు అంతర్జాతీయ ఆర్థికరంగంలో మనకు స్వతంత్ర ప్రపత్తి లభించింది. విదేశీయుమైన ఆర్థిక సహకారంతో దేశ పునర్నిర్మాణానికి అవసరమైన పునాదులను మనం గట్టిగా నిర్మించుకోగలిగాం.

అయినా మారకంరేటు తగ్గింపువల్ల ఎన్నో కష్టాలు వచ్చాయి. ఇందువల్ల ఇండియాకు డాలర్ సంపాదనలో పెరుగుదలలో తరుగుదలలో చెప్పడం ఇప్పుడప్పుడే సాధ్యం కాదు.

అదీకాకుండా 1948 ప్రారంభంనుంచి 1949 జూన్ చివరిదాకా లెక్కవేస్తే మన స్టర్లింగు నిల్వలు బాగా తగ్గిపోయినాయి. 1948 డిశంబరు ఆఖరున మన జమకు వున్న 1537 కోట్ల రూపాయిలు, 1949 జూన్ ఆఖరికి 820 కోట్లకు దిగజారిపోయినాయి. అంటే 717 కోట్లు తగ్గిపోయాయన్నమాట. దీనికి మనం చేసిన డాలర్ కొనుగోళ్లు ఒక 19 కోట్లుకలిపితే, మొత్తం 736 కోట్లు తరుగు ఏర్పడినట్లు విశదమౌతుంది. ఇందుకు అనేక కారణాలు వున్నాయి.

తరువాత డా॥ మత్తయ్ మనం ఇంటర్నేషనల్ బ్యాంకునుంచి తీసుకున్న అప్పులనుగూర్చి ప్రస్తావిస్తూ, ఇండియా తనకు 800 లో, 850 మిలియన్ల డాలర్ల అప్పు కోరింది అని బయలుదేరిన ప్రవాదాలను ఖండిస్తూ, తన తలకు మించినఅప్పును ఇండియా ఎన్నడూ చేయదని స్పష్టం చేశారు. అదీ కాకుండా ఇంటర్నేషనల్ బ్యాంకు మనకు అప్పు ఇస్తున్నదంటే, అదిమనం నిర్వహించదలచుకున్న ప్రత్యేక ప్రయోజనాలను సాధించడంకోసం ఇస్తున్నది కాని, మనం ఇతరులకు ఇవ్వదలిన మొత్తాలను చెల్లించడానికి ఇవ్వడంలేదు. ఆ మొత్తాలను చెల్లించడానికిగాను మనం అంతర్జాతీయ ద్రవ్యనిధిలో అప్పుపుచ్చుకొన్నాం. ఆ విషయం అట్లా వుండనీయండి. ఇప్పుడు ఇంటర్నేషనల్ బ్యాంకు మన దేశంలో ప్రాజెక్టులు అవీ నిర్మించడానికిగాను అప్పు ఇస్తానన్నది. అంతకు ముందు ఇంకోసారి మనదేశంలో రైల్వేల అభివృద్ధికిగాను 34 మిలియన్ల డాలర్ల అప్పు ఇచ్చింది. దీనితో మనం రైల్వేల అభివృద్ధికి కావలసిన ఇంజనులు, మొదలైనవాటిని కొంటున్నాం అని జాన్ మత్తయ్ చెప్పారు.

ఇంటర్నేషనల్ బ్యాంకు దగ్గరనుంచి 1949 సెప్టెంబరు 29 వ తేదీ నాడు భారతదేశం మళ్లీ అప్పుతెచ్చుకుందని, దీన్ని ప్రత్యేకం వ్యవసాయ కాభివృద్ధికి పనికి వచ్చు యంత్రపరికరాలను కొనడంకోసమే వినియోగించవలసివుంటుందని ఒప్పందం గోవ్రాస్తున్నామని, ఆయనచెప్పారు. ఇది 10 మిలియన్ల డాలర్లు. దీన్ని మనం 10 సంవత్సరాలలో తీర్చాలి. దీనిమీదవడ్డీ 3½% అని ఆయన పార్లమెంటుకు నివేదించారు.

ఇప్పుడు తిరిగిమళ్ళీ ఇంటర్నేషనల్ బ్యాంకులో అప్పుకోసం సంప్రదింపులు జరుగుతున్నాయి. దీన్ని ఒకరోజు ధర్మల్ యూనిట్ నిర్మాణంకోసం తీసుకుంటున్నాం. ఇది 22 మిలియన్ల డాలర్లు దీన్ని 25 సంవత్సరాలలో తీరుస్తామని అంటున్నాము. వడ్డీ 4¼% వుంటుంది.

ఇప్పుడు మనం తీసుకున్న బాకీలమీద అంతర్జాతీయ ద్రవ్యనిధినుంచి తీసుకున్న 100 మిలియన్లడాలర్లమీద వడ్డీ చెల్లించవలసివుంటుంది. ఈ నూరు మిలియన్ల డాలర్లను త్వరలో తీరుద్దామని ప్రయత్నాలు చేస్తున్నాం. సంవత్సరానికి 10 మిలియన్ల డాలర్లచొప్పున 10 సంవత్సరాల్లో దీన్ని రద్దుచెయ్యాలని ఆశిస్తున్నాం. అందువల్ల వీటి అన్నింటిని దృష్టిలో వుంచుకొని లెక్కకడితే మనం వచ్చేసంవత్సరంలో కట్టవలసిన 15 మిలియన్ల డాలర్లమొత్తమునూ 1956 నాటికి 19 మిలియన్ల డాలర్ల దాకా చేరుతుంది.

అందువల్ల ఇక మనం అప్పుచేసి, దేశ నిర్మాణ కార్యాన్ని నిర్వహించలేమని తేలిపోతున్నది. ఇక మన నిర్మాణ పథకాలన్నీ నెరవేరాలంటే, విదేశీ పెట్టుబడిని దేశంలోకి రానీయవలసిందే. అందువల్ల ఆ పెట్టుబడి మంచి అవకాశంకలిగే వాతావరణాన్ని సృష్టించడానికి మనం కృషి చేయవలసివుంది. అందాకా మనం అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థమీద ఆధారపడక తీరదు. ఇప్పుడు దేశంలో ఉక్కు కర్మాగారాల నిమిత్తం అప్పుకోసం, నీటిపారుదల ప్రాజెక్టులకోసం, మనం ఇంటర్నేషనల్ బ్యాంకుతో రాయబారాలు జరుపుతున్నాం; వచ్చే సంవత్సరంలో వారి తాలూకు మిషన్ ఒకటి ఇండియాకు వస్తుంది. అసలు ఆ బ్యాంకు వీటికి డబ్బు ఇవ్వడానికి సిద్ధంగావున్న సూచనలు కనపడుతున్నాయి.

ఈ అప్పులన్నింటిని భారత దేశం స్వతంత్రదేశంగా నిర్వహించుకొన్నది. అదికాకుండా అమెరికాలో అప్పులు పుచ్చుకోవడంగూడా ఇదే ప్రథమం. వీటి అన్నింటివల్ల, భారతదేశం ప్రపంచ ఆర్థికరంగంలో స్వతంత్రమైన హోదాను నెలకొల్పుకున్నదని వ్యక్తమౌతున్నది అని జాన్‌మత్తయ్ తన ఉపన్యాసాన్ని ముగించారు.

స్టర్లింగు నిల్వలను గూర్చి ప్రవేశపెట్టిన ప్రతిపాదనకు ప్రొఫెసర్ షా, ఇంటర్నేషనల్ బ్యాంకుతో ఒప్పందాలకు శ్రీ పంజాబ్ రావు దేశముఖ్‌లు సవరణలు ప్రతిపాదించారు.

ప్రొఫెసర్ షా తన సవరణలో స్టర్లింగు నిల్వల చరిత్రను పరిశీలించేందుకు 11 మందితో ఒక సంఘాన్ని ఏర్పాటు చేయాలని కోరారు. డా॥ దేశ్‌ముఖ్ బ్యాంకులో తీసుకున్న అప్పులో 1/3 వంతును మాత్రమే యంత్ర సామగ్రిమీద ఖర్చుపెట్టి, తక్కిన మొత్తంతో దేశంలో ఫ్యాక్టరీలు నెలకొల్పే విధంగా ఆ ఒప్పందాలను సవరించాలని తమ సవరణలో కోరారు.

అనంతరం చర్చ ప్రారంభమయింది. ప్రథమంగా శ్రీ బి. దాస్ మాట్లాడుతూ స్టర్లింగు నిల్వల విషయంలో బ్రిటన్ పెత్తనం ఇక సాగేందుకు వీల్లేదని, 1950 జనవరి 26 న ఇండియా రిపబ్లిక్ రాజ్యం కాబోతున్నది కాబట్టి ఇక ఈ విషయంలో బ్రిటన్ పెత్తనాన్ని ఎందుకు సహించాలని అన్నారు. నాకు ఇంగ్లీషువాళ్ళ మాటల్లో నమ్మకం లేదు. బ్రిటన్‌దివాలా తీసింది. అందువల్ల మనం స్టర్లింగు ప్రాంతంలో వుండిగూడా లాభంలేదు. డా॥ మత్తయ్ ప్రత్యేకంగా రూపాయిప్రాంతాన్ని ఏర్పాటు చేస్తే బాగుంటుందని ఆశిస్తూ ఈ సందర్భంలో సూచించారు.

బ్రిటన్‌తో ఇండియా చేసుకున్న స్టర్లింగు ఒప్పందం ఇండియాకు ఎంతమాత్రం మేలు చేకూర్చదని ప్రొఫెసర్ షా అన్నారు. దీనివల్ల దేశంలో ద్రవ్యోల్బణం ఎక్కువౌతున్నది. అదీ కాకుండా ఈ నిల్వలను ఎట్లా ఖర్చు పెట్టుకోవలసింది తేల్చుకోవలసింది మనంగాని ఇందులో బ్రిటన్ ప్రమేయం అనవసరం. దీనికి తోడు బ్రిటన్ ఒకసారి ఆడిన మాటను పలుసార్లు తప్పింది. అందువల్ల ఇండియాలో వున్న బ్రిటిష్ పెట్టుబడిని మనం హామీగా వుంచుకోవాలి అని ప్రొఫెసర్‌షా అన్నారు.

పోతే అమెరికాలోని ఇంటర్నేషనల్ బ్యాంకుతో ఒప్పందాలు చేసుకోవడం కోసం వారికి మనం స్థితిగతులను విచారించే అధికారాన్ని ఇవ్వడం సిగ్గుచేటు పని అని ప్రొఫెసర్‌షా ప్రభుత్వాన్ని అభిశంసించారు.

శ్రీ అజిత్ ప్రసాద్ మాట్లాడుతూ ఆర్థిక మంత్రి నెరవేర్చిన కార్యం బాగానే వున్నదన్నారు. ఈపరిస్థితులలో ఇంతకన్న ఎవ్వరూ బాగా చెయ్యలేరనీ గూడా ఆయన అన్నారు.

శ్రీ అజిత్ ప్రసాద్ మాట్లాడుతూ వుండగా, సిధ్వా కల్పించుకొని కొన్ని ప్రశ్నలు వేశారు. ఈ సందర్భంలో ప్రసాద్ విదేశాలనుంచి వస్తున్న ధాన్యాన్నంతా ఎవరు తింటున్నారు అని అన్నప్పుడు ఆ సంగతి ఆహార మంత్రిని అడగండి అని సిధ్వా అనగా సభ్యులంతా నవ్వారు.

డా॥ పంజాబ్ రావు దేశముఖ్ ముఖ్యంగా ఇంటర్నేషనల్ బ్యాంకునుంచి తీసుకున్న అప్పులనుగూర్చి మాట్లాడుతూ వాటిని అప్పులనేందుకు వీల్లేదని, అవి కాంట్రాక్టులని అన్నారు. మనంమన ఆర్థిక ప్రతిపత్తిని జాగ్రత్తగా నడుపుకోవలసి వుంది. ఇతరదేశాల్లో తీసుకున్న అప్పులను దుబారా చెయ్యకుండా దేశంలో వస్తూత్పత్తిని ఎక్కువచేసేనిమిత్తం ఫ్యాక్టరీలను పెట్టాలి అని ఆయన సూచించారు.

ఆ తరువాత బి. పి. ఝా, సర్దార్ భూపేంద్రసింగ్ మాన్, శ్రీ ఎ. సి. గుహలు పై ఒప్పందాలను విమర్శిస్తూ మాట్లాడారు. ఇండియాకు ఎటువంటి వ్యవసాయకపు పనిముట్లు అవసరమైతే అటువంటి పనిముట్లనే కొనుక్కుంటుంది. కాని ఫలానావనిముట్లే కొనాలని ఒప్పందంలో వ్రాసుకోవడం ఎందుకు అని శ్రీ సర్దార్ మాన్ ప్రశ్నించారు.

దేశాన్ని పాలించినప్పుడు బ్రిటన్ ఏ విధంగా మనల్ని కొల్లగొట్టిందో, అదే విధంగా స్వాతంత్ర్యంవచ్చిన తరువాత గూడా దోచుకుంటున్నది. అని శ్రీ ప్రకాశంగారు అన్నారు. బ్రిటన్ మనకు అప్పుపడి వుండిగూడా అప్పుఇచ్చిన దేశంలాగా ప్రవర్తించడం, దాన్ని మనం సహించడం విచిత్రంగా వున్నదని ఆయన అన్నారు. బ్రిటన్ ఇప్పుడు ఏవో హామీలు ఇచ్చింది సరే. రేపు టోరీలు అధికారంలోకి వస్తారు. అప్పుడు వారు ఈ ఒప్పందాలను కాదనరన్న హామీ ఎక్కడవుంది? అని శ్రీ పంతులుగారు ప్రశ్నించారు.

శ్రీ కృష్ణస్వామి: అటువంటి హామీ వున్నా, వాళ్లు కాదనగలరు.

శ్రీ ప్రకాశం: అవతలివాడు ఏమి చేసినా నోరు మెదపలేని స్థితిలో మనం పడిపోయినాం. అంతే, వాళ్లు మన శక్తిమీద రుద్దినదాన్ని కాదనే ధైర్యం మనకు లేదు.

పండిట్ నెహ్రూ మనం కామన్‌వెల్తులో వున్నా, మనల్ని బంధించగలిగింది ఏమీ లేదన్నారు గాని, ఇప్పుడు బ్రిటిష్ వారు కామన్‌వెల్తు పేరుతో మనల్ని దోచుకుంటున్నారు అని శ్రీ ప్రకాశంగారు అన్నారు.

ప్రస్తుతం దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్యల్లోంచి బయట పడడానికి ప్రభుత్వం తీవ్రమైన చర్యలకు దిగాలని, కాకపోతే, రూపాయివిలువ తగ్గింపువల్ల ఏర్పడిన పరిస్థితిలో మనం అడుగంటిపోతామని, శ్రీ పంతులుగారు హెచ్చరించారు.

# చుంకింగ్‌లో కమ్యూనిస్టు సేనల ప్రవేశం

## నగరంలో సంక్షుభితస్థితి: జాతీయ చైనాప్రభుత్వ పలాయనం

హాంగ్ కాంగ్, నవంబర్ 29: చైనా జాతీయప్రభుత్వ రాజధాని చుంకింగ్ నేటిరాత్రి మహా అల్లకల్లోలంగా సంక్షుభితంగా ఉన్నది. కమ్యూనిస్టు గొరిల్లాలు పట్టణముయొక్క వెలుపలి శివార్లలోకి అదివరకే ప్రవేశించిరి; యాంగ్ట్సీ నది దక్షిణ ఒడ్డుమీదుగా పురోగమించి వస్తున్న కమ్యూనిస్టు సైన్యములు పట్టణమునకు నాలుగుమైళ్ల దూరంలోకి వచ్చినవి. పట్టణం అంతా లూటీలు కొట్లాటలు సాగుతూ అరాజకం కాగా పౌరులు భయోద్విగ్నులై ఉన్నారనీ, నగరానికి నఖముఖాలా దిశలు మారుమ్రోగేట్లు కమ్యూనిస్టుల శతఘ్నికాల్పులు వినపడుతున్నవనీ, ఆఖరిక్షణాన విమానాలలో పారిపోయి వచ్చిన కాందిశీకులు చెప్పిరి. నగరంలో 19 లక్షల జనాభా ఉన్నది; సాధ్యమైనంతవరకు నగరంలో శాంతిభద్రతలు కాపాడడానికి ఒక పౌరసంఘం ఏర్పడి ప్రయత్నం చేస్తున్నది. నగరంలో మిగిలి ఉన్న కొద్దిమంది జాతీయసైనికులు తమ పని తాము చేస్తున్నాము, అనిపించుకుంటున్నారేగాని తీవ్ర ప్రతిఘటన ఏమీ జరపడంలేదు. జాతీయప్రభుత్వం చుంకింగుకు పశ్చిమోత్తరంగా 200 మైళ్ల దూరంలో ఉన్న ఛెంగ్టూకు తరలిపోయింది.

ఆఖరికి చెంగ్టూను రక్షించడానికికూడా, జాతీయప్రభుత్వం చేతిలో ఇప్పుడు చెప్పదగినన్ని సైన్యాలు లేవు. చుంకింగ్ నుంచి చెంగ్టూకు పరిశక్తమైన బాట వున్నది. సెక్వాన్ రాష్ట్రంలో ఉత్తరాన జనరల్ హుసుంగ్ నాన్ నాయకత్వంకింద కొన్ని జాతీయ సైన్యాలు వున్నవి. అయన తన సైన్యాలనుకూడా తీసుకొని చెంగ్టూ వైపుగా కదలిపోతున్నాడు. కాని చెంగ్టూను రక్షించడానికి అయన నిజంగా గట్టిప్రయత్నం చేస్తాడా అన్నది సందేహం. బహుశా అయన చెంగ్టూను రక్షించే ప్రమేయం పెట్టుకోకుండా సైన్యాలతో సహా టిబెట్ యాంగ్‌లోని దుర్గమపర్వతప్రాంతాలలోకి ఉపసంహరించుకోవచ్చుననీ, మొదటిపక్షంకన్న ఈ రెండవ పక్షమే ఎక్కువ సంభవంగా కనిపిస్తున్నదనీ అందరూ అంటున్నారు. ఈ రెండవ పద్ధతిగా జరిగినట్లయితే, అయన సైన్యాలు జీతబత్తెములూ, జీవనాధారముగూలేక బందిపోటు ముఠాలుగా చెదిరిపోయి పొట్టపోసుకోడంకోసం పల్లెపట్టులమీద పడి దోపిళ్ళు, లూటీలు ప్రారంభించడం అనివార్యం అవుతుంది.

కమ్యూనిస్టుల ప్రధానబలం తిరోగమిస్తున్న జాతీయసైన్యాలను వెనకవైపునుంచి అడ్డుకొట్టడంకోసం చుంకింగ్‌కు పశ్చిమోత్తరంగా మళ్ళిపోతున్నవి. క్వయాంగ్ నుంచి పశ్చిమదిశగా పురోగమిస్తున్న కమ్యూనిస్టుసైన్యాలు అనేక రాజమార్గాలకు కూడలిఅయిన పెచిరెమెన్‌కు 10 మైళ్ళదూరంలోకి వచ్చినవని ఇంతకు ముందువచ్చిన ఒకవార్తవల్ల తెలిసింది. ఈ కూడలి కమ్యూనిస్టుల వశమైతే, సెక్వాన్‌లోని జాతీయసైన్యాలకు దక్షిణచైనాకు నడుమ వీలాటి రహదారి సంబంధము లేకుండా పోతుంది.

క్రొత్తప్రభుత్వ పీఠమైన చెంగ్టూ కూడా పక్షం రోజులకన్న నిలవదని సైనిక నిపుణుల అంచనా. ఈ 12 నెలల్లోను జాతీయవాదులు ఇంతవరకు 3 రాజధానులు మూరారు. చెంగ్టూ నాలుగవ రాజధాని. పూర్వ రాజధానులైన నాంకింగ్, కాంటన్లు క్రమముగా ఏప్రిల్ 23 వ అక్టోబరు 14 న పడిపోయినవి. జాతీయ సైన్యాల పరాజయ చరిత్రలోని మరికొన్ని ప్రధాన తేదీలు ఈ దిగువ పేర్కొనబడినవి:— ముక్డెన్ పతనం 1948 అక్టోబరు; టిమెంట్సిన్ 1949 జనవరి 15; పెకింగ్ జనవరి 22; హాంకో మే 16; షాంఘై మే 26; తాత్కాలిక కార్యకర్తృడు జనరల్ లీసుంగ్ జెన్ త్వరలోనే అమెరికాకువెళ్ళి సైనిక సహాయంకోసం తిరిగి విజ్ఞప్తి చేయగలవని తెలియుచున్నది. 16 మంది అమెరికన్ కాపనసభ్యులు ప్రస్తుతం హాంగ్ కాంగ్‌లో ఉన్నారు. లీసుంగ్ జెన్ అమెరికావెళ్ళి తిరిగి వచ్చేవరకు, జనరల్ పాయ్ చుంగ్ సి కౌంగ్‌సికి దక్షిణంగా ఒక రక్షణశ్రేణిని ఏర్పాటుచేసి కమ్యూనిస్టులు దానిని దాటిరాకుండా ప్రతిఘటించడానికి ప్రయత్నించగలడు. ఇండో చైనా - చైనా సరిహద్దువెంటకూడా కొంతభూభాగాన్ని నిలుపుకోడానికి అయన ప్రయత్నించగలడు. ఎటొచ్చి ఎటుపోయినా ఆఖరుక్షణాన యునాన్‌లోని జాతీయ సైన్యాలతో వెళ్లి కలవడానికి ఈ మార్గం ఉపకరిస్తుంది.

### ఇండోచైనాలో సన్నాహాలు

హానాయ్, ఇండో చైనా, నవంబరు 29: కమ్యూనిస్టు సైన్యాలు ఇదివరకు అనుకున్న దానికన్న ముందుగానే ఇండో చైనా సరిహద్దును సమీపించేట్లు ఉన్నవి. ఈపరిణామానికి అనుగుణంగా ఫ్రెంచివారు ఇండో చైనాలో తగిన సన్నాహాలు చేసుకుంటున్నారు.

జాతీయ సేనాని అయిన పాయ్ చుంగ్ సీ సైన్యాలు బైటికి తప్పించుకొని పోవడానికి వీలులేకుండా క్వాంగ్సీలో చిక్కుపడి ఉన్నవి. వీరు కమ్యూనిస్టులతో రాజీపడకుండా పోరాడడానికే నిశ్చయించుకున్నట్లయితే, క్రమంగా ఇండో చైనాలో తిరోగమించడం అనివార్యం అవుతుంది.

ఫ్రెంచి సైన్యాలు ఈ జాతీయ సైనికులను నిరస్త్రంచేసి చైనాకు తిప్పిపంపివేయవలసి వస్తుంది. ఈ నిరస్త్రంచేసే ప్రక్రియ రక్తపాతం లేకుండా జరగదని అనుకుంటున్నారు.

### చుంకింగ్‌నుంచి బయలుదేరిన విమానంమీద కమ్యూనిస్టుల కాల్పులు

హాంగ్ కాంగ్, నవంబర్ 29: చుంకింగ్‌ను అంటియున్న కయులూన్ విమానాశ్రయంనుండి ఆఖరి క్షణాన బయలుదేరి వచ్చిన ఒక విమానం కమ్యూనిస్టుల తుపాకి కాల్పులకు గురి అయింది. విమానం మధ్యాహ్నం 12 గం. వేళ బయలుదేరింది. కమ్యూనిస్టులు అప్పుడు విమానాశ్రయానికి 150 గజాల దూరంలో ఉన్నారట. కాల్పులు ప్రారంభమైన వెంటనే విమానం బయలుదేరింది; అలోందరలో రావలసిన వారుకూడా 27 మంది వెనక దిగబడిపోయినారు. 30 మంది మాత్రం విమానంమీద సురక్షితంగా హాంగ్ కాంగ్‌కు చేరుకోగల్గిరి. విమానాశ్రయంలో ఇంకా వందలకొలది ప్రయాణీకులు నిలిచిఉన్నారనీ, వారిలో కొంతమంది కమ్యూనిస్టులు సమీపించగానే వారిలో కలిసిపోయినారనీ తెలుస్తున్నది.

### ఫ్రెంచి ప్రభుత్వానికి చూఎవన్‌లై హెచ్చరిక

హాంగ్ కాంగ్, నవంబరు 29: చైనాకు ఇరుగుపొరుగున ఉన్న దేశాలు, పలాయనమై పోరుచున్న జాతీయ సైన్యాలకు, ఆశ్రయం ఇవ్వకూడదనీ, ఈ సూచనను త్రోసిపుచ్చి ఆశ్రయం ఇచ్చినపక్షంలో దాని వల్ల కలిగే ఫలితపర్యవసానములకు ఆయా దేశముల ప్రభుత్వములే బాధ్యత వహించవలసి ఉంటుందనీ చెబుతూ చైనా కమ్యూనిస్టుప్రభుత్వ విదేశాంగమంత్రి చూఎన్‌లై నేడొక హెచ్చరిక చేసెనని పెకింగ్ రేడియో ప్రకటించింది. చైనాలో ఉన్న వివిధదేశాల రాయబారులకు ఈ హెచ్చరిక అందజేయబడినదట.

### "ఫ్రెంచిపాలనను తుదముట్టించండి"

#### హోచిమిన్‌కు మావ్ సందేశం

సైగాన్, నవంబర్ 29: "ఫ్రెంచి పాలనమీద మీరు సాగిస్తున్న యుద్ధం జయప్రదం అవుతుందని ఆశిస్తున్నాను. మా స్నేహ సద్భావాలు మీ పట్లనే ఉన్నవని నేను హామీ ఇస్తున్నాను. చైనా ప్రజా రిపబ్లిక్, వియెట్నాం రిపబ్లిక్‌ల మధ్య సన్నిహిత సంబంధాలు ఏర్పడాలని కోరుతున్నాను" అని చైనా కమ్యూనిస్టుప్రభుత్వాధ్యక్షుడు మావ్ సే టుంగ్, వియెట్నాం ప్రతిఘటనోద్యమ నాయకుడు డాక్టర్ హోచిమిన్‌కు పంపిన అభినందన సందేశంలో తెలియజేశాడని వియెట్నాం పక్షపు రేడియో నేడు ప్రకటించింది.

# జాతీయ ట్రేడ్‌యూనియన్‌పై ఆరోపణలు

## కేవలము యుద్ధమని శ్రీ దేవేన్‌సెన్

లండన్, నవంబరు 29: భా. జా. ట్రే. యూ. కాంగ్రెస్ భారత కార్మికుల ప్రతినిధి సంస్థకాదని, ఈ సంస్థను ప్రభుత్వమువారు స్థాపించిరని ఫ్యాక్టరీ యజమానులు దీనికి అండగానున్నారని హింద్ మజ్దూర్ సభ గావించిన ఆరోపణలు అబద్ధములని ప్రపంచ కార్మికసభకు భారతరాయబారిగ నాయకుడుగావచ్చిన శ్రీ దేవేన్‌సెన్‌గారు నేడిచ్చట చెప్పిరి. అంతర్జాతీయ కార్మికసంస్థవారు ఈ ఆరోపణలను విచారించి వానిని నిరాకరించిరని ఆయన చెప్పెను.

తాను ఏర్పరుపదలచుచున్న ఆసియా కార్మిక ఫెడరేషను విషయమై ప్రశ్నింపగా యింతవరకు తాను లండనులో యిష్టాగోష్ఠిసభలు మాత్రమే జరిపెననిరి. నూతన ఫెడరేషను స్వరూపమెట్టిదిగా నుండవలెను? లండన్‌సభ స్థాపించు నూతన ప్రపంచ కార్మికసంస్థతో దాని సంబంధము లెట్టిగానుండవలెను? అను విషయమై సభకువచ్చిన మలయా, చైనా, జపాను, ఇరాన్, లెబనాన్ ప్రతినిధులతో తాను చర్చించెదనని ఆయన చెప్పెను. ఈ ఆసియా కార్మిక ఫెడరేషను నూతన ప్రపంచ సంస్థకు ప్రాంతీయశాఖగా నుండుట తన అభిమతమని సేన్ గారనిరి.

* * *

### అధ్యక్షుడుగా బెల్జియమ్ దేశస్థుని ఎన్నిక

ప్రపంచ కార్మికసభ అధ్యక్షుడుగా పాల్ ఫినెటా నేడు ఎన్నికయ్యెను. నూతన అంతర్జాతీయ ట్రేడ్‌యూనియను యేర్పరుచుటకుగాను ఈ సభ లండనులో సమావేశమగుచున్నది.

# నగరి ఫిర్కా అభివృద్ధి సంఘ సమావేశం

నగరి, నవంబర్ 28: ఈ ఫిర్కా అభివృద్ధిసంఘ సమావేశము నేడు స్థానికబోర్డు ఉన్నతపాఠశాల ఆవరణలో చంద్రగిరి రెవెన్యూడివిజనల్ ఆఫీసరు శ్రీ ఎస్. శివసుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతను జరిగినది. సమావేశంలో చిత్తూరుజిల్లాబోర్డు అధ్యక్షులు ఎన్. పి. చెంగల్రాయనాయుడుగారు, జిల్లాలోని వివిధశాఖల అధికారులు, అనధికారులు, ఫిర్కాలోని మేటిరైతులు పాల్గొన్నారు.

ఈ ఫిర్కాలో గత మాసంలో విద్య, ఆరోగ్య, రోడ్లు, సహకార, పంచాయతీ పశువైద్యం, పరిశ్రమలు మొదలగు శాఖలవారు జరిపినకృషిని సమీక్షిస్తూ అధ్యక్షుల వారికి వారివారినివేదికలను అందజేయడమైనది. తర్వాత యీ క్రింది తీర్మానములు చేశారు.

నగరిలో గృహపరిశ్రమ కేంద్రం ఒకటి స్థాపించుటకున్ను, వ్యవసాయ పనిముట్లు సహకార సంఘాలద్వారా రైతులకు విక్రయించవలసిందనిన్ని, కావేటిపురం గుండీల సహకారపరిశ్రమ సంఘానికి ఒక నేర్పరి యిన్‌స్పెక్టరును తెప్పించి హరిజనులకు 6 మాసములకు యీ పరిశ్రమలో తర్ఫీదునిచ్చుటకున్ను, దామరపాకం గ్రామంలో ప్రాథమిక వైద్యకేంద్రమును స్థాపించుటకున్ను ప్రభుత్వ అనుమతిని కోరుతూ ఒకతీర్మానం చేశారు. జిల్లాబోర్డువారు యీ ఫిర్కాలో ఆబోతులు కొనడానికి యిచ్చిన రు. 400/- లను గోవిందప్పనాయుడు కండ్రిగ, నింద్ర గ్రామాలకు ఆబోతులు కొనడానికి పంచియివ్వడమైనది.

ఈ ఫిర్కా అభివృద్ధి సంఘ సభ్యులు ఫిర్కాలో మరమ్మత్తులులేక పాడుపడివున్న చెరువులు, కసం కాలువలను స్వయంగాచూచి వాటి మరామత్తులను గురించి కమిటీకి నివేదికలు అందజేయవలసిందని కోరారు. (స్వ. వి.)

### తొండలదిన్నె

ఈ నెల 27 వ తేదీ రాత్రి తొండలదిన్నె గ్రామం చౌడేశ్వరీ దేవాలయంలో 8 గంటలకు రావుల మునిరెడ్డిగారి అధ్యక్షతను రైతు మహాసభ జరిగింది. సభకు రైతులు, నేతపనివారు, కూలీలు దాదాపు 500 మంది చుట్టుగ్రామాలనుంచి హాజరైనారు. డి. కె. వర్మగారు సభను ప్రారంభిస్తూ ప్రస్తుత దేశపరిస్థితులు ప్రజలకష్టములు, వరదల మూలమున చెడిపోయిన భూములు, యిండ్లు, నష్టపరిహారము గురించి ప్రభుత్వం చేసిన సదుపాయములు, చేయుటకు ఆలోచించు చున్న విషయమును గురించి, ప్రస్తుత చేనేత పనివారి నిరుద్యోగసమస్య గురించి చెప్పిరి. పల్లా పెద్దనారాయణ, వద్దిరంగయ్యగార్ల అభివందనములతో సభ ముగిసింది.



గుత్తిహైస్కూలులో 26 వ తేదీన గాంధీజీ విగ్రహ ఆవిష్కరణ జరిగినప్పుడు ఊరేగింపు

గుంటూరులో నవంబరు 23 వ తారీఖున జరిగిన శ్రీ రామమూర్తిగారి ఆయుర్వేద కళాశాల రజతోత్సవ సందర్భమున తీసిన ఛాయాచిత్రము.

# నైరృతి ఆఫ్రికా సమస్యపై ప్రపంచ న్యాయస్థానానికి నివేదన

## ఇండియా సూచనకు ధర్మకర్తృత్వసంఘామోదం

లేక్‌సక్సెస్, నవంబరు 29: నైరృతి ఆఫ్రికా సమస్యకు సంబంధించిన న్యాయాంశాలను పరిశీలించి అభిప్రాయం చెప్పే నిమిత్తం ఆ సమస్యను ప్రపంచ న్యాయస్థానానికి ప్రతిపాదించవలసినదని ఇండియా, నార్వే, సిరియా, డెన్మార్క్, నయాములు కలిసి ప్రతిపాదించిన తీర్మానాన్ని సమితిధర్మకర్తృత్వ సంఘం నేడు ఆమోదించినది. తీర్మానానికి అనుకూలంగా 30 వోట్లూ, ప్రతికూలంగా 7 వోట్లూ వచ్చినవి. 9 మంది సభ్యులు తటస్థంగా ఉన్నారు.

ఈ తీర్మానం ప్రకారం ఈ కింది అంశాలమీద ప్రపంచ న్యాయస్థానం తన అభిప్రాయాలను ఇవ్వవలసినదని కోరబడినది.

(1) నైరృతి ఆఫ్రికాయొక్క అంతర్జాతీయ ప్రతిపత్తి ఏమిటి?

(2) నానాజాతిసమితి (జెనీవా) నిర్ణయించిన మాండేటరీ బాధ్యతలను దక్షిణాఫ్రికా ఇంకా అనుసరించవలసి ఉన్నదా? అన్నట్టయితే ఆ బాధ్యతలేవి?

(3) నైరృతి ఆఫ్రికాను అంతర్జాతీయ ధర్మకర్తృత్వానికి అప్పగించవలసిన బాధ్యత ధర్మకర్తృత్వ విధానాన్నిబట్టి దక్షిణాఫ్రికాకు ఉన్నదా?

(4) పైప్రశ్నకు విరుద్ధ సమాధానం వచ్చేటట్లయితే, పరాధీన ప్రాంతాల విషయమై వివరిస్తున్న సమితిసూత్రం నైరృతి ఆఫ్రికాకు అన్వయిస్తుందా?

(5) నైరృతి ఆఫ్రికాకు గల అంతర్జాతీయ ప్రతిపత్తి (మాండేట్ హోదా)ను మార్చే అధికారం దక్షిణాఫ్రికాకు ఉన్నదా? లేనిపక్షంలో దాని ప్రతిపత్తిని మార్చగల అధికారం ఎవరికి ఉన్నది?

సన్నిహిత సంబంధాలు నెలకొల్పటమన్న మిషతో దక్షిణాఫ్రికా నైరృతి ఆఫ్రికాను తన ప్రాంతంలో అంతర్భాగముగాచేసి, సమితికి పరిపాలనా నివేదికలనే పంపటానికి నిరాకరించినందువల్ల చివరిప్రశ్నకూడా వేయబడినది.

ఈ ప్రశ్నలతోపాటుగా ఈ క్రిందిరికార్డులుకూడా ప్రపంచ న్యాయస్థానానికి పంపాలని తీర్మానం నిర్దేశించినది.

(1) మాండేటరీ విధానంపై నానాజాతిసమితి నిర్ణయ తీర్మానం (2) జర్మనీ కిందనుంచి నైరృతి ఆఫ్రికాను తప్పించి దక్షిణాఫ్రికాకు మాండేటుగా అప్పగించిన మసాయిదా. (3) మాండేటరీ విధానానికి సంబంధించిన ఇతర తీర్మానాలు. (4) సమితి సర్వసభ్య సమావేశ చర్చలు, తీర్మానాలు.

వీటితోపాటుగా రెవరెండ్ స్కాట్ చెప్పిన సాక్ష్యాన్నికూడా పంపాలని హైటీప్రతినిధి ప్రతిపాదించాడు. కాని అసలుతీర్మానం సాక్ష్యపు సారాంశాన్ని జల్లెడిస్తున్నది కనుక దానిని ఉపసంహరించుకున్నారు.

సమితి వెనుకచేసిన తీర్మానాలను పునరుద్ఘాటిస్తూ, నైరృతి ఆఫ్రికా పరిపాలన విషయమై తనకు నివేదికలు పంపవలసినదనీ దక్షిణాఫ్రికాను నిర్దేశిస్తూ ధర్మకర్తృత్వసంఘం తీర్మానం చేయటంకూడా పూర్తిఅయినది కనుక ఇప్పుడు ప్రపంచ న్యాయస్థానానికి ప్రతిపాదించటానికి వేళ మించిపోయినదని చైనా-ఫిలీ ప్రతినిధులు అన్నారు.

### "సమితే ధర్మకర్తృత్వం వహించాలి"

లేక్‌సక్సెస్, నవంబరు 29: నైరృతి ఆఫ్రికాను ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వం క్రింద వుంచవలసిందిగా సమితి తాలూకు ధర్మకర్తృత్వ సంఘం నిన్న తీర్మానించింది.

ఈ తీర్మానాన్ని ఇండియా ప్రతిపాదించింది. పైన విషయమే కాకుండా, నైరృతి ఆఫ్రికా పరిపాలనకు సంబంధించిన రిపోర్టులను దక్షిణ ఆఫ్రికా ధర్మకర్తృత్వ సంఘానికి సమర్పించాలని కూడా ఇండియా తీర్మానం కోరుతున్నది.

ఇండియా తీర్మానంలో ముఖ్యభాగం ఈలా వున్నది: నైరృతి ఆఫ్రికా విషయంలో అదివరకు రిపోర్టులను సమర్పిస్తానని దక్షిణ ఆఫ్రికా మాటఇచ్చి, ఇప్పుడు ఆ ఇచ్చినమాటను అధఃకరిస్తున్నందుకు ఈ కమిటీ విచారిస్తున్నది. ఇకముందునుంచి అటువంటి రిపోర్టులను ధర్మకర్తృత్వ సంఘానికి సమర్పించవలసిందిగా ఈ సంఘం దక్షిణ ఆఫ్రికాను కోరుతున్నది.

కాని ఇవ్వాళ్ల ఉదయం భారత ప్రతినిధి శ్రీ సాచిన్‌చౌదరి పైభాగంలో "అధఃకరిస్తున్నది" అన్నమాటను "ఉపసంహరించుకొన్నది" అని సవరించారు. అయినా దాన్ని చర్చకు పెట్టినప్పుడు ఫిలిప్పైను ప్రతినిధి తీర్మానంలో అధఃకరిస్తున్నది అనేమాట చేర్చాలని సవరణ ప్రతిపాదించగా, దానిని ధర్మకర్తృత్వసంఘం అధికసంఖ్యాకులబలంతో ఆమోదించినకారణంగా ఆమాట తిరిగి తీర్మానంలో చేర్చబడింది.

అనంతరం మెక్సికో, గ్వాటమాలా ప్రతినిధులు పైతీర్మానంమీద ప్రసంగిస్తూ వుండగా, దక్షిణఆఫ్రికా ప్రతినిధి జూస్టే వచ్చి, తమ ప్రతినిధివర్గం నైరృతి ఆఫ్రికా విషయమై ధర్మకర్తృత్వ సంఘం చర్చించినంతకాలమూ తాము సంఘసమావేశాలకు హాజరుకామని ప్రకటించారు.

నైరృతిఆఫ్రికాలో నివశిస్తున్న దేశీయ ప్రజానీకం తరఫున ఎవరన్నా మాట్లాడుతామంటే, వారిని అట్లామాట్లాడనీయడం మాప్రభుత్వానికి గిట్టదు. ఈ విషయాన్ని నేను స్పష్టంగా ప్రకటించివున్నా, ధర్మకర్తృత్వసంఘం రెవరెండ్ స్కాట్‌ను మాట్లాడనిచ్చింది. ఈవిధంగా ఇచ్చట ఈసంఘం మాప్రభుత్వం యొక్క అధికారాన్ని గుర్తించకుండా, దాన్ని అవమానాలపాలుచేసింది. ఆ కారణంచేత మమ్మల్ని ఇక ఈ విషయంమీద ఈ సంఘం జరిపే చర్చలలో పాల్గొనవద్దని మా ప్రభుత్వం ఆదేశించింది అని జూస్టె ఈ సందర్భంలో అన్నారు.

అనంతరం తీర్మానంమీద జరిగిన చర్చలో బ్రిటిష్ ప్రతినిధి సర్ పెట్రిక్ సూన్‌డ, ఆఫ్రికాకు కొంత అనుకూలంగా మాట్లాడిన అనంతరం సంఘం అధ్యక్షుడు ఈ క్రింది తీర్మానాన్ని ఓటుకు పెట్టారు.

నైఋతి ఆఫ్రికాలో తాను నిర్వహిస్తున్న ధర్మకర్తృత్వాన్ని గూర్చి సమితికి రిపోర్టులు దాఖలుపరచుకుంటానని దక్షిణ ఆఫ్రికా పూర్వం అనేకసార్లు మాటయిచ్చింది. ఇప్పుడు ఆమాట అధఃకరించి ప్రవర్తిస్తున్నది. ఈసంఘం అందుకు విచారిస్తూ, నైఋతి ఆఫ్రికాను సమితి ధర్మకర్తృత్వంక్రింద ఉంచాలని, అచ్చట తమ పాలనను గూర్చి రిపోర్టులు సమితికి సమర్పించాలని సర్వసభ్యసమావేశంవారుచేసిన తీర్మానాలను దక్షిణ ఆఫ్రికా పాలించి తీరాలని ఈసంఘం నిర్ణయిస్తున్నది.

తీర్మానానికి అనుకూలంగా 31 ఓట్లున్నూ, ప్రతికూలంగా 11 ఓట్లున్నూ వచ్చాయి. 4 గురు తటస్థంగా వున్నారు.

స్ట్రేలియా, బెల్జియం, కెనడా, గ్రీస్ నెదర్‌ల్యాండ్సు, నార్వే, స్వీడన్, టర్కీ, బ్రిటన్, అమెరికాలు ఈ తీర్మానానికి వ్యతిరేకంగా ఓటుచేశాయి.

# స్టెర్లింగ్ నిల్వలపై బ్రిటిష్ పార్లమెంటులో చర్చ

## గత యుద్ధ సహాయానికి బ్రిటన్ ముదరా కోరదు

లండన్, నవంబరు 29: బ్రిటిష్ కామన్సుసభలో కన్సర్వేటివ్ సభ్యుడు క్రాస్‌బయిట్ చేసిన ప్రశ్నకు సమాధానంగా బ్రిటిష్ ఖజానామంత్రి సర్ స్టాఫర్డ్‌క్రిప్సు ఇలా సమాధానమిచ్చారు: "గతంలో చేసిన యుద్ధసహాయంక్రింద, తన దగ్గర స్టెర్లింగులు వుంచుకున్న దేశాల వద్ద బ్రిటన్ ముదరా తీసుకోదలచలేదు. యుద్ధ పరికరాల గిడ్డంగులు వగైరా వప్పగింత చేసినప్పుడు ముదారాలు తీసుకున్నాం. ఇంకా అలాంటి లావాదేవీ లేవన్నా వుంటే చూసుకుంటాం."

# గుడ్సురైలుపై కమ్యూనిష్టుల విధ్వంసక చర్యలు

## బోనకల్, చింతకాని స్టేషన్ల మధ్య సంఘటన: రైల్వే ఇంజనీరు హత్య

విజయవాడ, నవంబరు 30: గతరాత్రి 10 గం. 20 నిమి. లప్పుడు సాయుధ గుండగీండ్రు కొందరు హైదరాబాదు సంస్థానంలో బోనకల్లు, చింతకాని స్టేషన్ల మధ్య ఖమ్మంమెట్టు పోతున్న గూడ్సు రైలుబండిని ఆపి, దానికి తగిలించబడిన ఒక ప్రత్యేక పెట్టెలో ప్రయాణం చేస్తున్న సైగల్ అను ఎస్. ఎస్. ఆర్ ఇంజనీరును కాల్చి చంపినారని వార్త వచ్చింది. ఈ సాయుధ దుండగీండ్రు కమ్యూనిష్టులని భావించబడుచున్నది. వీరు లైను కాపలామనిషిని మోది అతనివద్దనుండి ఎర్రలాంతరు తీసుకొని దానిని చూపి గూడ్సు బండిని ఆపినారట. డ్రైవరు గార్డు ఇంజను వద్దనుండే తదితరులు తుపాకి చూపించి పారిపోవలసిందని భయపెట్టినారు. ఇది జరిగినతర్వాత సైగల్‌ను బయటకులాగి, కొంతదూరం తీసుకొని వెళ్ళి అక్కడ కాల్చి చంపినారట. దుండగీండ్రు పారిపోవుటకు ముందు నీటి గొట్టాన్ని కోసి ఇంజను చెడగొట్టినారు. చింతకాని చేరుకొన్న రైలు డ్రైవరు ఈ విషయాన్ని తెలియచేయగా సికింద్రాబాద్‌లోని రైల్వే అధికార్లు సంఘటన జరిగిన ప్రదేశానికి వేరొక ఇంజను తెల్లవారు ఝామున 4 గం. 30 ని. లకు పంపటానికి ఏర్పాట్లు చేశారు. ఈ సంఘటన ఫలితంగా గ్రాండుట్రంకు ఎక్స్‌ప్రెస్ 2 గంటలు ఆలస్యంగా వచ్చింది.

ఇంజనీరు శవాన్ని సికింద్రాబాద్ తీసుకొని పోతున్నారు. ఈ సంఘటన వార్త చేరగానే సాయుధపోలీసులు, మిలిటరి సంఘటన ప్రదేశానికివెళ్లి దర్యాప్తు చేస్తున్నారు. ఇంజనీరు ఊలునూలు ఒక చేతిగడియారము దుండగీండ్రు ఎత్తుకొనిపోయారట. అయితే వారు పెట్టెలలోనికి మాత్రం పోలేదు. (స్వ. వి.)

# ఫిబ్రవరి 4 న హరిజన నాయకుల సభ

న్యూఢిల్లీ, నవంబరు 29: భారత రాజ్యాంగ సభయందలి హరిజన సభ్యులు, ఇతర హరిజన వర్గాల్లు నేడిచ్చట సమావేశమై రాబోవు సంవత్సరము ఫిబ్రవరి 4, 5 తేదీలలో నాగపురమునందు రాజ్యాంగ పరిషత్తునందలి హరిజన సభ్యులు, వివిధ శాసన సభ్యులలో హరిజన సభ్యులు, ఇతర వర్గాలతో కూడిన ఒక మహాసభ జరుప నిశ్చయించిరి. ఈ సభకు మద్రాసు ఎసెంబ్లీ స్పీకరు శ్రీ శివషణ్ముఖం పిళ్లై అధ్యక్షుడుగా నెన్నుకొన బడెను. ఈ సభ నూతన రాజ్యాంగము క్రింద హరిజనుల భవిష్యత్తును నిర్ణయించునని నేటి సభకు అధ్యక్షత వహించిన శ్రీ ఖండేకరు గారు చెప్పిరి.

## కామత్ తీర్మానం

న్యూఢిల్లీ, నవంబర్ 29: ప్రతిరోజూ పార్లమెంటు సమావేశాన్ని దైవప్రార్థనతో ప్రారంభించాలి' అని ఒక తీర్మానాన్ని తాను రేపటి పార్లమెంటు సమావేశంలో ప్రతిపాదించబోతున్నానని హెచ్. వి. కామత్ తెలియజేశారు. ఈ తీర్మానాన్ని ప్రతిపాదించకుండా మాను కోవలసిందిగా కాంగ్రెస్ పార్టీవారు కామత్‌గారిని కోరారు. కామత్‌గారు అందుకు అంగీకరించలేదు. ప్రతిపాదించి తీరతానని తన దృఢ నిశ్చయాన్ని తెలియజేశారు. అది తన ఆత్మవిశ్వాసాలకు సంబంధించిన విషయమనీ, అందుచేత ఉపసంహరించుకోవటానికి వలనుపడదనీ తెలియజేశారట.

# నైగీరియా పరిస్థితి:

## రహస్యపరిశీలన నిలుపుదల

లండన్, నవంబర్ 29:— నైగీరియా (పశ్చిమ ఆఫ్రికా)లో అన్ని ప్రాంతాల పరిస్థితులు శాంతంగా ఉన్నవని గవర్నర్ మెక్‌ఫర్సన్ నేడు బ్రిటిష్ వలస శాఖకు వెంతి నిచ్చాడు. కిందటివారం పోలీసు కాల్పులు జరిగిన ఎనుగు రాష్ట్రం బొగ్గు గనుల్లో పనిని ప్రారంభించటానికి సంప్రదింపులు జరుగుతున్నవి. కాల్పుల విషయమై ప్రభుత్వ విచారణ జరగవలసి ఉన్నది.

నైగీరియాలో పరిస్థితులను పరిశీలించ బ్రిటిష్ గూఢచారి శాఖాధిపతికి ఆజ్ఞ ఇంచలేదనీ, అటువంటి ఆలోచన లేదని ఇక్కడి అధికారవర్గాలను విచారించగా తెలుస్తున్నది.

## కావలెను

రాజమండ్రి మునిసిపాలిటి, రాజమండ్రి

దిగువ తెలిపిన ఉద్యోగములకు అర్హతకలిగినవారినుండి దరఖాస్తులు కోరబడుచున్నవి. స్వదస్తు దరఖాస్తులు 10-12-49 లోగా కమీషనరుకు చేరవలెను అర్హతలు, పూర్వానుభవము వయస్సు, పుట్టిన స్థలము, కులము, తెలిసిన భాషలు దరఖాస్తుదారులు తమ దరఖాస్తులలో తెలియజేయవలెను.

| ఉద్యోగం పేరు | జీతం స్కేలు | అర్హతలకు ఆర్డర్లు |
|---|---|---|
| 1. మెడికల్ ఆఫీసరు (యూనాని) | రు 80-5-150 | 11-10-35 పి. హెచ్. డి. జీ. ఓ. 2651 |
| 2. కాంపౌండరు (యూనాని) | రు 30-1-45 | సవరింపబడిన 7-10-38 పి. హెచ్. డి. జీ. ఓ. నం. 3654 |
| 3. మగనర్సింగ్ ఆర్డర్లి (యూనాని) | రు 17-½-25 | |
| 4. శానిటరీ ట్రెయినింగు యిన్‌స్పెక్టర్ | రు 50-2-70-2½-95 గ్రేడు I / రు 45-2-75 గ్రేడ్ II | ఎం. ఇ. ఆర్. 13 |
| 5. ఆయిల్ యింజను డ్రయివరు | రు 40-1-60 | సవరించిన 21-9-32 ఎల్ అండ్ ఎం. డి. జీ ఓ. నం. 3750 |
| 6. ఎలిమెంటరీ స్కూలులో తెలుగు పండిట్ | రు 40-1½-55-2-75 | ఎం. ఇ. ఆర్. 18 |

బి. సూర్యనారాయణరావు, కమీషనరు, 28-11-49.





## ఆంధ్రరాష్ట్ర సమస్య

### ఆంధ్ర నాయకుల సమావేశ సన్నాహములు

చెన్నపట్నం, నవంబరు 29: ఆంధ్రుల రాజధాని తాత్కాలికంగా మద్రాసులో ఉంచుతారా? లేక ఏ పట్నమును రాజధానిగా చేసుకొనెదరా? మద్రాసు భవిష్యత్తును ఏవిధముగా నిర్ణయింపబోయెదరు? ఆస్తి అప్పులను ఎటుల పంచుకొనెదరు మున్నగు ప్రధాన సమస్యలపై మద్రాసు ప్రభుత్వ అభిప్రాయమును తెలుపవలసినదిగా కేంద్ర ప్రభుత్వమువారు మద్రాసు ప్రభుత్వము వారిని కోరినారని అభిజ్ఞులు తెలుపుచున్నారు. ఈ సమస్యలపై సమాధానము వచ్చినగాని గవర్నరు జనరల్ ఉత్తర్వు జారీచేయుటకు వీలులేదని భారతప్రభుత్వమువారి లేఖలో ఉదహరించబడినట్లు, జనవరి 26 వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్ర విభజన అమలుచేయ వీలగునో లేదో ఆ లోపున ఈ సమస్యలు పరిష్కారమగుటకు వీలుండునో, లేదో సాధ్యమైనంత త్వరలో గూడా తెలుపవలసినట్లు గనుకవారు కోరినట్లు తెలియుచున్నది.

కాంగ్రెసువర్కింగుకమిటీవారు వదలివేసిన క్లిష్టసమస్య లన్నిటినీ ఈ లేఖలో చేర్చి, వాటిని మద్రాసు ప్రభుత్వము, శాసనసభ్యుల కమిటీ తేల్చవలసినదిగ కోరినారనికూడా తెలియుచున్నది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారు చెన్నపట్నమును ఉమ్మడి రాజధానిగా ఉంచవలసినదని కోరియున్నందున, ఉమ్మడి రాజధానిగా ఉండుటకు వీలు ఉండునేమో తెలుపవలెనని కేంద్రప్రభుత్వము కోరినందున, ఉమ్మడిగా ఉన్న రోజుల్లో ఆంధ్రులు మద్రాసును పరిసరప్రాంతాలను ప్రత్యేక రాష్ట్రముగ చేయ యత్నించవచ్చుననియు, వారిఉద్యమము జయప్రదమగు సావకాశము ఉన్నదనియు తమిళులు భయపడుచున్నట్లు కన్పిస్తున్నది. మద్రాసులో ఆంధ్రులుండవచ్చు. అద్దెకున్నవారుగా ఉండవలెనుగాని స్వతంత్రులుగా ఉండరాదని వారివాదమై ఉన్నది.

కేంద్రప్రభుత్వం వారికిగూడా ఈ విషయములో జోక్యముచేసుకొను హక్కులేదనీ, అంతా తాముచెప్పినట్లే జరుగవలెననీ కామరాజనాడారుగారు చెప్పుచున్న దానికి నిష్పక్షదృష్టిగల తమిళనాయకులే సమ్మతించుట లేదు. ఆంధ్రులు తమ హక్కులను ఒకసారి వదలుకున్నా మన్నపుడు ఇల్లా "మనమిలు విరగద్రొక్కి తామనడం" అను సామెత కరంగా ఉన్నదనియు, విడిపోవునపుడు జ్యేష్ఠసోదరుడు, చిన్నతమ్ములఎడ చూపించవలసిన ఔదార్యము మాట కేపు జరుగు న్యాయమును తమిళులు ప్రదర్శించుటలేదని; ఏ పక్షమునకు చెందనివారు తెలుపుచున్నారు.

మద్రాసు మంత్రివర్గము ఆరోతేదీ ఈ విషయమును చర్చించులోపున ఆంధ్రనాయకులు డా॥ పట్టాభి, ప్రకాశం, వెంకట్రావు, రంగా, విశ్వనాథంగారలతో మద్రాసుప్రభుత్వ ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు సంప్రదించుటకు ఆంధ్రనాయక సమావేశమును పిలుచుటకు సన్నాహములు చేయుచున్నట్లు తెలుస్తున్నది. వెంకట్రావుగారు 6 వ తేదీకి మద్రాసు రానున్నారు. రంగాగారు వచ్చెదరని తెలిపినట్లు తెలియుచున్నది. ఆంధ్రనాయకు లందరూ ఏకమై భవిష్యత్ కర్తవ్యమును నిర్ణయించవలెనని ఆంధ్రమంత్రులు తలచుచున్నారు. శ్రీ గోపాలరెడ్డిగారు ఇతర నాయకులకు ఉత్తరములు వ్రాయుచున్నట్లు తెలియుచున్నది. అవసరమైనచో గోపాలరెడ్డిగారు బీహారు బొంబాయి రాష్ట్రములకు వెళ్లి వారి విభజనపద్ధతులు పరిశీలించి రావలెనని ఆలోచించుచున్నారు మంత్రివర్గ అభిజ్ఞవర్గములలో ఈ విభజన 26 వ తేదీలోపున సాధ్యముగాదను దృష్టిలో ఉన్నారు. కాని ఆంధ్రనాయకాగ్రేసరులు జనవరి 26 వ తేదీలోపున ఎటులైన దీనిని సాధించి, గవర్నరుజనరల్ ఉత్తర్వు రప్పించవలెనను దీక్షతో ఉన్నారు

### పశ్చిమ, తూర్పు బెంగాల్ సరిహద్దు నిర్ణయం

కరాచీ, నవంబర్ 28: తూర్పు పాకిస్థాన్ పశ్చిమ బెంగాలుకు మధ్యనున్న సరిహద్దును నిర్ణయించే విషయంలో స్వీడిష్ హైకోర్టు జడ్జి బాగేగారి నాయకత్వం క్రింద నియమింపబడిన మధ్యవర్తి సంఘం డిశంబర్ 5 వ తేదీన కలకత్తాలో తన కార్యక్రమం ప్రారంభించుతోంది అనంతరం పాను ఢక్కాకు వెళతారు.

కమిషన్ కార్యదర్శి జార్జి ఢక్కా చేరేనాటికి, ఈ కార్యదర్శి పాకిస్థాన్ ప్రధాని లియాకతలీఖాన్‌గారిని కలుసుకుంటారు. చేపు ఢిల్లీ వెడుతున్నారు, డిశంబరు 3 వ తేదీ కలకత్తా వెళ్లి అక్కడ నుంచి ఢక్కాకు వెళతారు. పశ్చిమ బెంగాల్ ప్రధాని డాక్టరు బి.సి. రాయ్‌తో ప్రాథమిక చర్చలు జరుపుతారు.

## సంగ్రహ వార్తలు

### పెదకాకాని

గుంటూరు తాలూకా పెదకాకాని గ్రామ గౌడ సంఘీయులు ది 25-11-49 వ సాయంత్రము 4 గంటలకు పెదకాకానిలో రావుల కేశవయ్యగారి అధ్యక్షతన సమావేశమై తాటిచెట్లను సీజను సమీపించినది గాన వెంటనే లైసెన్సులు యిప్పించవలెననీ, హేమలతా టెక్స్టైల్ మిల్లులో వృత్తిపోయిన గౌడ సంఘీయులకు పనులు కల్పించవలసినదనీ, వృత్తి కోల్పోయిన బీద గౌడులకు బంజరుభూములు యిప్పించవలెననీ, ప్రభుత్వంవారిని కోరుతూ తీర్మానించారు.

### గుంటూరు

ప్రాచ్య సారస్వత విజ్ఞానపరిషత్తువారి సప్తమ వార్షికోత్సవము రామమోహన ఆయుర్వేద కళాశాలాభవనమున కవిశేఖర శతావధాని మధ్వశ్రీ పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులవారి అధ్యక్షతక్రింద జయప్రదముగా జరిగింది. అంబటిపూడి నరసింహశర్మ, మద్దూరి సాంబయ్య, స్వయంపాకుల వెంకటరమణశాస్త్రిగార్లు తమతమ కావ్యరచనలను పఠించిరి. భారతుల వెంకటనరసింహశాస్త్రిగారు రసభావ ప్రసాద గుణములనుగూర్చి యుపన్యసించి, తాము రచించిన 'కావ్యఖండికమ్' అను సంస్కృతకావ్యమును పఠించిరి. శ్రీ పూర్ణప్రజ్ఞాచార్యులవారు రసాలంకారములు యానిత్యమునుగూర్చి వివరీకరించి, భావప్రధానమైన ప్రాచ్య సారస్వత సంపదనుగురించి యుపన్యసించిరి. కార్యదర్శి శ్రీ వామన శ్రీ సన్నయ్యశాస్త్రిగారి వందన సమర్పణముతో సభ జయప్రదముగ ముగిసెను. (స్వవి)

### నాగాయిలంక

కృష్ణాజిల్లా చేనేత కాంగ్రెస్ నాయకులు, నాగాయిలంక చేనేత సహకార సంఘ స్థాపకులు, అయిన కీ॥ శే॥ తిరువీధుల వెంకటరత్నంగారి చిత్రపటమును నాగాయిలంక చేనేతసంఘం కార్యాలయంలో 25-11-49 తేదీ సా॥ 5 గం॥కు చెన్నరాష్ట్ర చేనేతకాంగ్రెస్ కార్యదర్శి ప్రగడ కోటయ్యగారు ఆవిష్కరించిరి. ఈ సందర్భములో జరిగిన బహిరంగసభకు మండల లక్ష్మీనరసింహంగారు అధ్యక్షత వహించారు. అధ్యక్షులు తమ ప్రసంగములో శ్రీ వెంకటరత్నంగారు చేసిన ప్రజాసేవను ప్రశంసించారు. ప్రగడ కోటయ్య, అక్కలకోటయ్య, పోలవ అమ్మయ్య, బూదాటి ఆదెయ్య, అకురాతి లక్ష్మయ్య, కుమ్మలదర్ల వెంకటసుబ్బయ్య సిద్ధాంతిగార్లు వెంకటరత్నంగారి సుగుణములను ప్రస్తుతించుచూ ఉపన్యసించారు.

### నగరి

గత 21 తారీఖున కత్తెరపల్లె గ్రామంలో చిత్తూరుజిల్లాబోర్డు సభ్యులు శ్రీ మాదిరాజు సుబ్రహ్మణ్యంరాజుగారి అధ్యక్షతన కాంగ్రెసుమహాసభ జరిగెను.

అమ్మపల్లెవరకు రోడ్డు వేయు విషయము, ధాన్యశిస్తుల విషయమునుగురించి చర్చించబడెను.

తర్వాత ధాన్యం శిస్తువిషయంగురించి ప్రభుత్వంవద్దకు రాయబారం వెళ్ళుటకు ఒక కమిటీని ఎన్నుకోవడమైనది. సభకు అనేక రైతులు హాజరైరి. (స్వ. వి.)

### పాలకొల్లు

25 వ తేదీ సాయంత్రం ఈ ఊరి చినమామిడిపల్లిలో దాదాపు 35 పూరిండ్లు వ్యవసాయకూలీలందరు పరిపాలనులకు కోతలనిమిత్తం వెళ్లగా నిప్పంటుకొని తగులబడినవి. హరిజనులెవరును యింటివద్ద లేనిసమయమున తగులబడుటవలన ఇండ్లలోని ఏ ఒక్కసామానుకూడా తీసి జాగ్రత్తపెట్టుకొనుటకు సావకాశం లేకపోయినది. విశేషఆస్తి నష్టముసంభవించినది. నిరాశ్రయులైన గ్రామంలోని ఉదారులు సహాయంచేశారు.

### హైద్రాబాదులో సహకార ఉద్యమాభివృద్ధికి కృషి

హైద్రాబాదు, నవంబరు 28: సంస్థానంలో సహకార ఉద్యమాభివృద్ధి విషయమై తగు సలహా లిచ్చుటకుగాను హైద్రాబాద్ ప్రభుత్వ కోరికపై ...ర్ జి. సరయూగారు ఇటీవల హైద్రాబాదు వచ్చారు. వారు సహకార శాఖోద్యోగులతోను, ఆర్థిక శాఖలతోను సంప్రదింపులు జరిపారు. సరయూగారు, సంస్థాన కోఆపరేటివు సొసైటీ రిజిస్ట్రారు కె. ఐ. విద్యాసాగర్ గారితో కలసి ...గాబాద్‌లోని సహకార సంస్థలను పరిశీలించి త్వరలో హైద్రాబాదు వస్తారు.

### పోలీసుఇన్‌స్పెక్టర్ జనరల్ ఉత్తర్వు

హైద్రాబాద్. నవంబరు 28; సంస్థానంలో గల మహబూబ్ నగర్, ఆదిలాబాద్, ఉస్మానియా, బీదర్, ... జిల్లాల పోలీసు సూపర్నెంట్లు ప్రజాశాంతి విభాగ ... సివిల్ అధికారి అధికారాల ... హైద్రాబాద్ పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఉత్తర్వు చేశారు ... యాలలో ఎవరికైనా ... అధికారం సివిల్ అధికారికి ఉన్నది

## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 2 శుక్రవారం

### మద్రాసు (ఎ)

ఉ 7-30 శ్రీ. లక్ష్మీ పాట; 8-0 ఆంగ్లమున వార్తలు; 8-15 ఉదయ సంగీతం (రి); 8-30 మద్రాసు (బి) వలె. మ. 1-30 ఆంగ్లమున వార్తలు; 1-40 సినిమా సంగీతం (రి)! 4-30 పాశ్చాత్య సంగీతం (రి) 5-30 జి. సీత పాట; 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 జె. ఎస్. శ్రీనివాసమూర్తి పాట. 7-30 గీతమంజరి (రి). 7-45 జంత్రసమ్మేళనం. 8-15 రంగనాయకీ రాజగోపాలన్ వీణ. 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 విశ్వవిద్యాలయాలకు. బెంగాలీ కవిత్వము, హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ్. ఆంగ్లమున ప్రసంగం. 9-30 మద్రాసు (బి) వలె

### మద్రాసు (బి)

ఉ 7-0 తెలుగున వార్తలు. 7-15 మధురమణి అయ్యర్ రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 ఆర్. ఎస్. గోకయ్య క్లారినెట్ మ. 12-0 కార్మికుల కార్యక్రమం. 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు దుస్తుల జాగ్రత్త. పురుషుల భారినుండి. ప్రసంగం ఎస్. కృష్ణస్వామి 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు మావూరు, నాజీవితం. ప్రసంగం. నా పరిచయ కథ ప్రసంగం. పాఠశాల దినచర్య. సా 5-30 మద్రాసు (ఎ) వలె. 60-2 గానమంజరి (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం. జాతీయ పునర్నిర్మాణము వయోజనవిద్యాసంస్థలు. ప్రసంగం విశేషాలు, ప్రకటనలు, ధరలు, వాతావరణ వివరాలు. 7 తెలుగునవార్తలు. 7-15 పరిస్థితి, జనారోగ్యము, బస్తీబజార్లలో ప్రసంగం. పురవర్ణన, ఓగులు పద్యపఠన 8-15 మద్రాసు (ఎ) వలె. 9 30 క్రొత్తలుకొరిన పాటలు రికార్డులు. 10 అష్టపదులు కె. మల్లికార్జునరావు, ఎ. పి. కోమల

### విజయవాడ

ఉ 7 తెలుగున వార్తలు, 7-15 లక్ష్మీలోక, సుబ్రహ్మణ్యం రికార్డులు. 7-30 వి. నారాయణమూర్తి వీణ. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 గీతావళి, వారణాశి కామాక్షి. 8-30 వి. చెల్లప్ప. మ 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు, 1 శారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు. సా 5-30 త్రాడిగడప శేషయ్య పాట. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతావళి వారణాశి కామాక్షి. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7 తెలుగునవార్తలు. 7-30 చిత్రవాణి (రి) 7-55 సంస్కృత సాహితీ గోష్ఠి. అనంత కళ్యాణగుణ చిత్రణ ప్రసంగం. 8 వి. నారాయణమూర్తి వీణ. 8-30 వి. చెల్లప్ప పాట. 9 ఆంగ్లమున వార్తలు. 9-15 అహల్యా శాపవిమోచన. హరికథాకాలక్షేపం కుప్పా వీరరాఘవశాస్త్రి

### హైద్రాబాదు

ఉ. 7-45 నాత్ వహీదుద్దీన్. 7-50 అబ్దుర్ రహమాన్‌పార్టీ ఘజల్. 8 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) 8-20 రాజలక్ష్మి, ఎస్. కె. అయ్యర్ కర్నాటక సంగీతం. 8-50 తెలుగున వార్తలు. 9-15 పిల్లల కార్యక్రమం తెలుగున, 'శనిగ్రహం' నాటిక రచన, సి. భావనారాయణ, ఉత్తరాల సంచి, మన జిల్లాలు 'బీదర్' ప్రసంగం. ఎస్. లక్ష్మణరావు మ. 12-30 కవాలీ రికార్డు 1 భానుమతి రికార్డులు 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) సా 5 లక్ష్మీబాయి బరోడ్కార్ ఖయాల్ ఠుమ్రీ 5-20 అబ్దుర్ రహమాన్, ఘంసా ఘజల్. 5-35 లక్ష్మీబాయి బరోడ్కార్ గుజ్రీ 6 30 గ్రామస్థుల కార్యక్రమం తెలుగున ... (2) పసుసంపద ప్రసంగం. ఆరోగ్య సూత్రాలు. డాక్టరు ప్రసంగం. నీతి పద్యాలు. 7 తెలుగున వార్తలు. (ఎ ఐ. ఆర్ రిలే) 7-15 'పునావాపాన్' రికార్డులతో కూర్చిన కథ. 7-45 మన ... సమస్య సీటిపాలదల పసుపులు తెలుగున ప్రసంగం. 8-30 అబ్దుర్ రహమాన్‌పార్టీ ఘంసా. 8-40 లక్ష్మీబాయి బరోడ్కార్ ఖయాల్ అనది. 9 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్ రిలే) 9-15 లక్ష్మీబాయి బరోడ్కార్, ఖయాల్ సైకేన్నా, 9-55 రాజలక్ష్మి, ఎస్. కె. అయ్యర్ కర్నాటక సంగీతం. 10-25 ఎస్. ఎల్. ఎన్. శాస్త్రి వయోలిన్ 10-35 రాజలక్ష్మి, ఎస్ కె అయ్యర్ కర్నాటక సంగీతం.



రాజ్యాంగపరిషత్తు ఆమోదించిన నవభారత రాజ్యాంగముపై అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ సంతకము చేసిన సందర్భములో, బొంబాయి ప్రధాని బి. జి. ఖేర్ వారిని అభినందిస్తున్నారు.

# దేశంలో చక్కెర అధికోత్పత్తి యత్నం

## టారిఫ్‌బోర్డు అధ్యక్షుని అభిప్రాయం

బొంబాయి, నవంబరు 28 : దేశంలో పంచదార ఉత్పత్తిని ఎక్కువ చేయడంతో పాటు ఉత్పత్తి ఖర్చులు తగ్గించే విధముగాకూడా చేయాలి అని ఇండియన్ టారిఫ్‌బోర్డు అధ్యక్షుడు శ్రీ జి. ఎస్. మెహతా అన్నారు.

పంచదార పరిశ్రమకు రక్షణ కావాలా? అక్కరలేదా అనే విషయాన్ని సమాలోచించే నిమిత్తం జరుగుతున్న సమావేశాన్ని ప్రారంభిస్తూ శ్రీ మెహతా పంచదార ఉత్పత్తి ఎట్లా పెరుగుతుంది? ఆర్థిక స్తోమత్తు పెరిగి ఖర్చులు ఎట్లా తగ్గుతాయి అనే విషయాలను గూర్చి కొన్ని సూచనలుకూడా చేశారు.

చెరుకుపంట పొలందగ్గరనుంచి ఫ్యాక్టరీదాకా ఫ్యాక్టరీదగ్గరనుంచి వర్తకునిదాకా సంబంధించిన ఒక అంతరంగిక వ్యవస్థను నిర్మిస్తేనే అటువంటిపని సాధ్యమౌతుందని ఆయనచేసిన సూచన అన్నింటిలోకీ ముఖ్యమైంది.

దేశంలో పంచదార పరిశ్రమ క్రమపద్ధతుల్లో పెరగనికారణంగా, ఉత్పత్తిలో హెచ్చుతగ్గులగానీ, ఖర్చుల్లో తగ్గుదలగాని కనిపెంచలేదని ఆయన అన్నారు. ఉత్పత్తి ఖర్చు తగ్గడానికి వుపద్రవాలను ఇతోధికంగా ఉపయోగించాలని, దేశంలో ఏయే ప్రదేశాలలో యీపంటను పెంపొందించవచ్చునో పరిశోధనలను జరిపించాలని ఆయనసూచనలు చేశారు.

ఇతర దేశాలనుంచి పంచదారను తెప్పించుకునే విషయంలో టారిఫ్ బోర్డువారి అభిప్రాయమేమీ లేదని, విదేశ ద్రవ్యాల సమస్య పీడించకపోతే, తెప్పించవచ్చునని తాము ప్రభుత్వానికి తెలిపివున్నామని ఆయన అన్నారు.

ఎటువంటి వచ్చే సంవత్సరం దేశానికి ఎంతటి పంచదార కావలసివుంటుంది అన్న విషయంమీద చర్చ జరిగింది. దేశానికి మొత్తం సంవత్సరానికి 12, 18 లక్షల టన్నుల పంచదార కావలసి వుంటుందని దేశంలోవున్న ఫ్యాక్టరీలు నిజానికి యింతకన్న యెక్కువ మొత్తాన్ని ఉత్పత్తి చేయగలిగివున్నా అట్లా చేయడం లేదనీ, అందువల్ల యీ ఫ్యాక్టరీలు తమ ఉత్పాదనశక్తినంతా వినియోగించాలని యీచర్చలో తేలింది. ఇప్పుడువున్న ఫ్యాక్టరీలు ఒకటి రెండు రాష్ట్రాల్లో కేంద్రీకరింపబడి వున్నాయని, వాటిని యితర రాష్ట్రాలకు మారిస్తే, ఉత్పాదనశక్తి యెక్కువ కావచ్చునని కూడా ఈచర్చల సందర్భంలో సూచనలు వచ్చాయి.

## పడుపువృత్తి నిర్వహించిన స్త్రీ అరెస్టు

చెన్నపట్నం, నవంబరు 29 : ఈబు వెల్లివీధి నెం. 163 గృహములో తన కూతురు కాంతలక్ష్మి అను 16 ఏండ్లపిల్లను అవినీతి వ్యాపారమునకుదించి పడుపువృత్తిలు నిర్వహించుచుండిన నేరముపై జానకీ లక్ష్మి అమ్మాళ్ (40) అనునామెను పోలీసులు అరెస్టుచేసి ఆమెపై రెండవ రాజధాని మేజిస్ట్రేటువద్ద చార్జిషీటుదాఖలు చేసిరి. కేసు డిశంబరు 2 వ తేదీకి వాయిదా వేయబడెను.

## గా॥ పెరుమాళ్‌స్వామి రెడ్డి

చెన్నపట్నం, నవంబరు 29 : పరిశ్రమలమంత్రి శ్రీ పెరుమాళ్‌స్వామి రెడ్డిగారు నిన్న సాయంత్రం విమానంలో మదరాసుకు విచ్చేసిరి. వారినిమిత్తము కొంతకాలముగా వారి ఆరోగ్యమునుగూర్చి ప్రశ్నించిరి. శ్రీ రెడ్డిగారు ఈనాటి జనరల్ ఆసుపత్రిలో ప్రత్యేకవార్డులో చికిత్సపొందుటకు ప్రవేశించిరి.

# కోరుకొల్లు కమ్యూనిస్టు పరారీ కేసు

## అనుమానాస్పదులైనవారి అరెస్టు

భీమవరం, నవంబరు 28 : కోరుకొల్లు గ్రామంలో శ్రీ ఉద్దరాజు రామం అను కమ్యూనిస్టునాయకుని అరెస్టుచేసి స్పెషల్ పోలీసువారు తీసుకొనివచ్చుచుండగా కొంతమంది గ్రామస్థులు, కమ్యూనిస్టు పార్టీ అభిమానులు దారిలో కాచి పోలీసువారిని గాయపరచి ఉద్దరాజు రామంను విడిపించి పోలీసువారి రివాల్వరును ఎత్తుకొనిపోయిన సందర్భంలో డిప్యూటీ ఇన్‌స్పెక్టరు జనరల్ రాజరత్నంగారు కొందరు పోలీసు అధికారులతో కోరుకొల్లు గ్రామం వెళ్ళి గ్రామస్థులతో పూరించి వెళ్ళిన ప్రజలను అప్పగించవలసిన బాధ్యతవారి మీన వున్నదనియు పోలీసువారితో గ్రామస్థులు సహకరించవలసినదనియు హెచ్చరించగా, గ్రామస్థులు సహకరించుటకు పూనిన యిచ్చినట్లున్న, పోలీసు అధికారులు అచ్చటనున్న రిజర్వుదళమును తీసికొని వెళ్ళినది. కేసు దర్యాప్తు చేస్తూ పోలీసు అధికారులు ప్రత్యేక పోలీసు అధికారులు ఈవారంలో చాలా గ్రామాలు తిరిగి కోరుకొల్లు గ్రామస్థులు జోగి అప్పన్న, జి. సత్యనారాయణరాజు, బోడిసెట్టి వెంకట్రామయ్య, చేకూరి చినలక్ష్మీ పతిరాజు, భూపతిరాజు సూర్యనారాయణరాజు, నల్లపరాజు సత్యనారాయణరాజు, తూట సుబ్బారావు, చేకూరి వెంకట్రామరాజు అను వారలను అరెస్టుచేసి భీమవరంసబ్ జైలునందుంచిరి.

కంచుమర్రు గ్రామ కమ్యూనిస్టులు కోరుకొల్లు కేసుకు సంబంధించిరవారు రాజోలుతాలూకా పూబలంక గ్రామంలో ఉంటూ యున్నట్లు తెలసి స్పెషల్ పోలీసు ఇన్‌స్పెక్టరు ఆర్. వి. కృష్ణారావు రాజోలు సర్కిల్ జవ్వాది సత్యనారాయణగారు కొంతమంది రిజర్వు దళంతో గ్రామం ముట్టడిచేసి ముదునూరి వెంకట్రామరాజు కలిదిండి వెంకట్రామరాజు గార్లను అరెస్టు చేసికొనివచ్చిరి. పై వారలందరను స్థానిక మేజిస్ట్రేటు పంపర వీర్రాజు గారు రిమాండు ఉత్తర్వులిచ్చారు. (స్వ. వి.)

# రక్షణశాఖలో కూడా వ్యయకరణం

## బలదేవ్‌సింగ్ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 29 : భారతప్రభుత్వ రక్షణశాఖామంత్రి సర్దార్ బలదేవ్ సింగ్ గారు ఈరోజు పార్లమెంటులో ఒక ప్రశ్నకు సమాధానం ఇస్తూ రక్షణశాఖలో కూడా పొదుపుకోసం వ్యయకర్షణం జరిగిందని, అయితే దీన్ని ఆయన బలాలకు మాత్రం వర్తింపజేయలేదనీ అన్నారు. తాత్కాలిక కమిషన్ ఆఫీసర్లను తగ్గించివేసే ఉద్దేశ్యం మేమీ లేదనీ, కావలసిన సంఖ్యకంటే ఎక్కువగా వున్నవారిని తగ్గించడం జరగవచ్చుననికూడా అన్నారు.

## మోసంనేరమున్నై అరెస్టు

చెన్నపట్నం, నవంబర్ 29: కంచీవరం వాస్తవ్యుడు రామానుజ అయ్యంగార్ (35 యేండ్లు) అనునతడు యిటీవల చెన్నపట్నంలో నొక కిళాయి ఫీసువండు ఎవరో ఒక మనిషి రూ 9 మనియార్డరు పంపుటకు ఫారము వ్రాసి య్యమని కోరగా అతను వివరించెను ఆ మనియార్డరును గ్రాసుకొని కంచీవరములోని దానిని ఫలపుసుకొన్నాడు. ఈ మోసానికి సంబంధించి స్థానిక పోలీసులు దర్యాప్తు చేయగా పోలీసువారు రామానుజ అయ్యంగార్ని అరెస్టుచేసి 6వ రాజధాని మేజిస్ట్రేటు ముందు కేసు పెట్టియున్నారు.

# అణుశక్తి పరిశోధనల సమస్య

## బ్రిటన్ అమెరికా కెనడాల సహకారం

వాషింగ్టన్, నవంబరు 28 : అణుశక్తి పరిశోధనల విషయంలో అమెరికా, కెనడా, బ్రిటన్‌ల మధ్య పరస్పర సహకారం ప్రాతిపదికగా ఒక ఒప్పందం జరిగే సూచనలు బాగా కనపడుతున్నాయి.

ఇప్పుడు అటువంటి ఒప్పందం ఒకటి తయారైనదనీ, దాన్ని సాపు దిద్దుతున్నారని వార్తలు వస్తున్నాయి.

ఈ ఒడంబడికను గనుక అమెరికన్ కాంగ్రెసు ఆమోదిస్తే అణుశక్తిని గూర్చిన రహస్యాలలోనే గాకుండా, ఈ శాస్త్రజ్ఞులను మార్చుకోవడం,అటంకస్తువుల నిల్వలు, మొదలైన విషయాలలోకూడా ఈరాజ్యాలమధ్య అతి సన్నిహితమైన సహకారము ఏర్పడుతుంది.

ఇప్పుడు అణుశక్తిని పరిశ్రమల్లో వినియోగించడాన్ని గూర్చి అమెరికాలో విస్తృతమైన పరిశోధనలు జరుగుతున్నాయి. అణుశక్తి కమిషన్ అజ్ఞనుపొంది జనరల్ ఎలెక్ట్రిక్ కంపెనీ, వాషింగ్టన్ హౌస్, డ్యూపాంట్ కంపెనీలు ఈ విషయంలో మంచి పరిశోధనలు జరిపాయి.

ఈఒడంబడిక ఏర్పాటుచేసుకోవడంలో ఈ విషయానికి సంబంధించిన రహస్యాల విషయంలో మాత్రం కెనడా, అమెరికా, బ్రిటిష్ ప్రతినిధులకు ఒక సమస్యగా కనిపిస్తున్నది.

## ప్రజలలో ఏటంబాంబుపై ప్రచారం

చికాగో, నవంబరు 28: ఇప్పటికంటే ఎక్కువవిషయాలను అమెరికన్ ప్రజలకు ఆటంబాంబునుగూర్చి తెలియజెప్పాలని అమెరికన్ శాస్త్రజ్ఞుల ఫెడరేషన్‌వారు నేడు అన్నారు.

ఈ విషయాన్నిగూర్చి అమెరికాలో వాదోపవాదాలు జరుగుతున్నాయి. కొంతమంది ఆటంబాంబునుగూర్చి సాధారణ విషయాలను తెలియజేయాలని కొంతమంది అక్కరలేదని. ఇప్పుడు శాస్త్రజ్ఞులు మొండికెత్తి ఒలపరిచారు.

సెనెటర్ ఎడ్విన్ సి. జాన్సన్ ఈశాఖకు చెందిన వార్తలలో ప్రముఖుడు. ఈయన ఇంతవరకు చాలా రహస్యాలను రేడియోద్వారా బయటపెట్టారు. అటువంటి రహస్యాలు బయటకు రావడం ప్రజల క్షేమానికే అవసరం అని పై ఫెడరేషన్‌వారు అన్నారు

రష్యనులు తయారుచేసిన బాంబు ప్లూటోనియం బాంబు అని సెనెటర్ జాన్సన్ చెప్పారు. ఇప్పుడు అమెరికాలో తయారౌతున్న బాంబులు నాగసాకి బాంబు కన్న ఆరురెట్లు శక్తివంతమైనవని, వాటిని వెయ్యిరెట్లు బలంవున్న వానినిగా తయారు చెయ్యాలని అమెరికా కృషిచేస్తున్నదనికూడా ఆయన తెలియజేశారు.

ఇవాళ్ళపై ఫెడరేషన్ శాస్త్రజ్ఞులు జారీచేసిన ప్రకటనలో ఇలా వున్నది. సెనెటర్ జాన్సన్ బయటపెడుతున్న సాధారణ విషయాలుకూడా ప్రజలకు తెలియకూడదని భావించడం పొరపాటు. అందువల్ల వారిలో ధయాందోళనలు ఎక్కువౌతాయి.

## కాస్మోరేషను టవును ప్లానింగ్ కమిటీ

చెన్నపట్నం, నవంబరు 29: కార్పొరేషను టవును ప్లానింగ్ కమిటీ అధ్యక్షులుగా ప్రస్తుతము సాహేబుగారు శ్రీ సి. తామలింగ మొదల్యారు స్థానే నిన్న సాయంత్రంఎన్నుకోబడిరి.

# కొల్లేరులంకలలోని గ్రామాల దుస్థితి

## రెవిన్యూమంత్రిగారి పర్యటన

ఏలూరు, నవంబర్ 27: కౌలుదార్ల దుస్థితిని గమనించి వారికి తగుదిగా రక్షణ యిచ్చే నిమిత్తం శాసనం చేసే విషయమై ప్రభుత్వం శ్రద్ధగా ఆలోచిస్తున్నారని, మద్రాసు రెవిన్యూమంత్రి శ్రీ కా. సీతారామరెడ్డిగారి ఉదయం ఏలూరుతాలూకా కౌలుదార్ల సంఘంవారి విన్నపానికి జవాబిస్తూ పోమీ యిచ్చారు.

మంత్రిగారు ఆంధ్రలో తుపాను వలన నష్టపడిన ప్రాంతాలను పర్యటించేనిమిత్తం ఈ ఉదయం మద్రాసునుండి ఇక్కడకువచ్చారు. వారికి స్టేషనువద్ద అల్లూరి సత్యనారాయణరాజు ఎమ్. ఎల్. ఏ. (జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు) మాగంటి బాపినీడు ఎం. ఎల్. ఏ. శ్రీమతి సి. అమ్మన్నరాజా ఎం. ఎల్. ఏ. జనాబ్ షేక్ అహమ్మద్ (కలెక్టర్) టి. నారాయణస్వామినాయుడు, (డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు) ఎం. కరియప్ప ఆర్. డి. వో. జి. నరసింహారావు నాయుడు, విజయవాడ సూపరింటెండెంటు ఇంజనీర్, భావ్యం, వి. ఎస్. కృష్ణన్, జిల్లా వ్యవసాయ శాఖాధికారి, మాగంటి సీతారామదాసు (జిల్లాబోర్డు అధ్యక్షుడు) దుగ్గిరాల రాజశేఖరరావు (మునిసిపల్ ప్రెసిడెంట్ వైస్‌చైర్మన్) జనాబ్ బషీర్ అహమ్మద్ కమిషనర్ మొదలుగువారు స్వాగతం యిచ్చారు

స్టేషన్‌వద్ద ఏలూరు కౌలుదార్ల సంఘంవారు కోట్ల పుట్టయ్య, బాపిరెడ్డిదనం గార్ల నాయకత్వాన, కొంతియ్య రంగా ప్రదర్శనంచేశారు. "కౌలుదార్లకు భూస్వాములకు పంట చెరిసగం జేయాలి" అని నినాదాలుచేశారు.

తర్వాత రహదారి బంగళావద్ద పై సంఘము తరపువచ్చిన కౌలుదార్లందరూ సమావేశమైనపుడు అల్లూరి సత్యనారాయణరాజుగారు, కౌలుదార్ల కష్టములు వివరిస్తూ, ఈ సంవత్సరం తుపానులవల్ల దెబ్బతిన్న భూములన్నిటియందూ భూస్వాములు తమ కౌలుదార్లపట్ల దయాదాక్షిణ్యాలతో ప్రవర్తించాలనీ, పంట చెరిసగం పంచాలనే కౌలుదార్ల కోరిక న్యాయసమ్మతమైనదనీ, ఈ విషయమై మద్రాసు శాసనసభలో తాము ప్రస్తావించామనీ, కాని కొన్ని కారణాలవల్ల ప్రభుత్వం ఈ విషయంలో శాసనాన్ని ప్రవేశపెట్టలేకపోయినా, ప్రభుత్వానికి కౌలుదార్లపట్ల అధికమైన సానుభూతి ఉన్నదనీ, వారందరూ ఐకమత్యంతోనూ శాంతితోనూ ప్రవర్తించాలనీ ఉద్బోధించారు.

తరువాత కౌలుదార్ల సంఘం తరపున కోట్ల పుట్టయ్యగారు మంత్రిగారికి విజ్ఞాపన సమర్పిస్తూ, కవులుదార్ల అనేకవ్యయ ప్రయాసల కోర్చి వ్యవసాయము చేసినా తుపానువలన అంతా నష్టమైనమా, భూస్వాములు తమ పూర్తిగా కవులు మొత్తములు నిమ్మనీ, లేకపోతే నోట్లు వ్రాసియివ్వవలసినదనీ వత్తిడి చేస్తున్నారనీ, అలాయివ్వకపోతే భూము లివ్వమని బెదరిస్తున్నారనీ, నాటన్నిటికీ, కౌలుదార్లకు రక్షణయిస్తూ పండిన పంటలో కౌలుదారు భూస్వామి చెరిసగం తీసికొనేటట్లు, గడ్డి యావత్తూ కౌలుదారుకే వచ్చేటట్లు శాసనం చేయవలసిందనీ కోరారు.

మంత్రిగారు సమాధానమిస్తూ, కవులుదార్ల కష్టనష్టముల గురించి ప్రభుత్వం విచారిస్తున్నదనీ, ఈ విషయమై వెంటనే శాసనం చేయుటకు అవకాశం దొరకలేదనీ అన్నారు.

తమ జిల్లాయైన బళ్ళారిలో 8 సంవత్సరాల కోసారి క్షామంవస్తే, ఆ సంవత్సరం భూస్వాములు కౌలుదార్లనుండి ఏమీవసూలు కోరకుండా ఉండడం ఆచారం, శాసన సహాయంలేకుండానే, అనాదిగానున్నదనీ యీ ప్రాంతంలో అట్టిఆచారం ఉండి ఉంటుందని తాము అనుకున్నామనీ అన్నారు. ఐతే, యీసంవత్సరం పశ్చిమగోదావరిలోకూడా కరవుపరిస్థితులంటి పరిస్థితులే ఏర్పడినందున, భూస్వాములందరూ యీ పరిస్థితుల కనుగుణంగా తమకౌలుదార్లయెడ దాక్షిణ్యంతో ప్రవర్తిస్తారని ఆశిస్తున్నామనీ, అలాచేయకపోయినందుని కోరుచున్నామనీ అన్నారు. కౌలుదార్లకు రక్షణయిచ్చే నిమిత్తం ఏ విధమైన శాసనంచేయాలో అదికూడా ప్రభుత్వ విచారణలో వున్నదని తెలిపారు.

తంగెళ్ళమూడి తోళ్ళపాపులలో పనిచేస్తున్న కార్మికులు ఇబ్బందులను విమర్శ చేసినవిన్నపమునకు సమాధానమిస్తూ, ఆవిషయము జిల్లాకలెక్టరుగారి విచారణలో ఉన్నదనీ వారు త్వరలో తీర్మానిస్తారని అన్నారు. ఆనంతరం మంత్రిగారు కార్మికుల కెటువంటి నాగయింట్లకు సహాయాలకల్పించుట, పరిశీలించారు.

తరువాతి మంత్రిగారు యితరప్రముఖులు చాటపర్రు గ్రామంగుండా కొల్లేరు సరస్సులో వరద, తుపానులవల్ల దెబ్బతినిన లంక గ్రామాలను చూచేందుకు వెళ్లారు కొల్లేటిలో మంత్రిగార్కి ఒక ఆయిల్ లాంచి, యితరులకు పెద్దపడవలు యింజను అమర్చబడినలాంచీ ఏర్పాటుచేయబడినవి. చాటపర్రు మండి ముందుగా గుడివాకలంక గ్రామం వెళ్లారు. పడవలు బయలుదేరిన స్థలంనుండి 4 మైళ్ళ దూరమైనా కొల్లేటిలో వంకరలుగా తిరిగి వెళ్ళడం వల్ల గంటన్నర పట్టింది త్రోవలో మంత్రిగారు కొల్లేటిలో రెండవపంట సాగుచేసే నిమిత్తం భూస్వాములు అచ్చటచ్చట ఏర్పర్చిన ఆయిల్ యింజన్లు పంపులు చూచారు వీనిమీద ఆచ్ఛాదనగా వేసిన పాకలు అన్ని కూలిపోయి వానిపై గడ్డి ఎగిరిపోయియుంది, ఇంజన్లు గత నెలరోజులుగా 3, 4 అడుగుల లోతు నీటిలో ఉన్నాయి. రెండవ పంట కాలంలో కొల్లేరు అంతా ఎండిపోయినపుడు లోతు ప్రదేశాలలోని నీటి సహాయంతో తోడి దాళ్వా వరి సాగుచేస్తారు. ఈ ఇంజన్లు నీటిలోనుండిన పాడైపోవా, వాని నెల బయటకు తీయరాదాఅని మంత్రిగారడుగగా వానిని నీటిలోనుండి ఎత్తగల పరికరములుగాని వానిని మోయగల పడవలుగాని కొల్లేటిలో లేవనీ నీరు తగ్గేవరకు ఆలాగే ఉంచవలసి ఉంటుందనీ అక్కడివారు తెలియజేశారు.

గుడివాకలంక గ్రామం చేరగానే గ్రామస్థులంతా నీటివెంచుకువచ్చి స్వాగతం యిచ్చారు. గ్రామ పరిసరప్రాంతం మంచినీటి చెరువు పశువుల దెరువూ అన్నీ నీట మునిగి ఒకటే జలాశయంలా ఉన్నది. పల్లంలోఉన్న యిండ్లు నీటమునిగి నెల రోజులనుండీ ఆలాగే ఉన్నవి. కొంగా గ్రామంమధ్య ప్రదేశం ఎత్తుగా ఉండ వెంకల్ల ఆచటియిండ్లు పాడిగాఉన్నాయి తుపానుకు ఎగిరిపోయిన కప్పులు బాగు చేయుట జరగలేదు. ప్రజలలాగే నివసిస్తున్నారు. చాటపర్రు, ఈ గ్రామములమధ్య వందలాది ఎకరముల వరిపంట నీటినుండి ఇప్పుడిప్పుడే బయట పడుచుండుట మంత్రిగారు చూచారు. అ పొలంలోని కంకులు కొన్ని వారు తెప్పించి చూడగా వానిలో పూర్తిగా పాల్లుతప్ప ఒక్కగింజకూడా లేదు. చివరకు గడ్డికూడా కుళ్ళిపోయి, పశువులమేతకు పనికిరాదని మంత్రిగార్కి తెలియజేశారు.

ఈగ్రామంలో కొల్లేటి రైతుల దుస్థితిని గురించి ఒక విజ్ఞాపన సమర్పించారు. అందులో ఈ క్రింది విషయాలు తెలియజేశారు. తుపానువలన కల్గినవష్టం అన్ని ప్రాంతాలతోపాటు కొల్లేటిలంక గ్రామాలుకూడా అనుభవించాయి. కాని యితర ప్రాంతాలకన్నా, భరింపరాని ముంపు బాధ కొల్లేటి గ్రామాలన్నీ గతనెలరోజులుగా అనుభవిస్తున్నాయి. యింకా నెల రోజులకుగాని వరద తగ్గుట తోచదు. రోజుకు అరంగుళం చొప్పున తగ్గుతోంది. కప్పులెగిరిపోవడమే కాకుండా చాలాకాలం నీటిలో ఉండటంవల్ల చాలా యిండ్లుకూలిపోయినవి. అందువలనయిండ్లు బాగుచేసుకోవడమే కాకుండా, పూర్తిగా నిర్మించుకోవలసిన ఆవసరంకూడా ఏర్పడింది. ఈ ప్రాంతంవారి కితరప్రాంతాల కంటే అధికసహాయం కావాలి. పంటలు పూర్తిగా నాశనమైపోవడమే కాకుండా, ఈ ప్రాంతంలో, నివసించే అధికసంఖ్యాకులైన వడ్డీపల్లెస్థులకు వృత్తియైన చేపలు పట్టుకొనుటకు వారుపయోగించే "మావులు" (చేపలను పట్టుకొనుటకు వెదురు పేళ్లతో తయారుచేయబడిన బోనువంటివి) కూడా వందలకొలది కొల్లేటివరదలలో కొట్టుకొనిపోయినవి. ఒక్కొక్క 'మావు' ఖరీదు రు 3/- ఉంటుంది. ప్రస్తుతదుర్భర పరిస్థితిలో ఈ ప్రాంతపు పేదజనులువానిని తిరిగి కొనుక్కోలేరు కనుక, ఈ విషయంలోకూడ వారికి ప్రభుత్వం సహాయం చేయవలసి ఉంటుంది.

మునిగిపోయి భూములకు సెప్టెంబరునాట్ల రెండవపంటసౌకర్యం యిప్పించవలెననీ, ఈప్రాంతంలో వందలకొలది ఎకరములు నా ఉన్న ప్రభుత్వభూమిని, పేదలందరికీ, తలకొక రెండెకరములు శాశ్వతముగా యివ్వవలెననీ, ఈ ప్రాంతానికి రహదారి సౌకర్యములు కల్గించవలెననీ అభ్యర్థనలో కోరారు.

గ్రామస్థులు తమకు బియ్యం కొరకు పంపినదని, కొల్లేటిలో దొరికే కలువలు గింజలను, (వీనినే వారు "బెల్లాలు" అంటారు.) ఆవిచారిపించుకొని తింటున్నామని చెప్పి, ఆకలుకాయలనూ, బెల్లాలనూ ఉడకబెట్టిన అన్నమునూ మంత్రిగార్కి చూపించారు. ఈ ఆహారం చప్పగా ఉండిపోవడమేకాకుండా, యింకా పుష్టికరమయిన పదార్థము కాదనీ, పైగా అనారోగ్య కారణమనీ, కడుపు నింపు కొనడం నిమిత్తం తింటున్నామనీ అన్నారు. వరద అతి త్వరగా వచ్చుటవల్ల కొల్లేటిలోని చేపలన్నీ మొదలను మునిగిన సరిహద్దులలోకిపోయి, చేపలుకూడా సరిగా దొరకడం లేదని తెలిపారు.

మంత్రిగారన్ని విషయాలూ శాంతంగా విని, తాము చేయగలదంతయూ చేస్తున్నామనీ, ప్రభుత్వం నిన్న మొన్న మంజూరు చేసిన 5 లక్షల మొత్తమునుండే వారికి సహాయం త్వరలో లభిస్తుందనీ అన్నారు. అనంతరం ప్రభుత్వంవారు తుఫాను బాధితుల నిమిత్తం, తీసికొనివచ్చిన చీరలు శ్రీమతి అమ్మన్న రాజాగారు చీరలను పంచారు. బాపినీడుగారు మంత్రిగారు లంకలలోని ప్రజల దుస్థితి స్వయంగా తెలిసికొనేందుకు వచ్చారనీ, వారికి తెలియజేశారు.

గుడివాకలంకనుండి మంత్రిగారు కొక్కిరాల లంకవెళ్ళారు. ప్రయాణంలో ఎటు చూచినా మైళ్ళకొలది నీరు, నీటిలో జమ్ము, రెల్లు పచ్చగడ్డితోనూ, దూరమున అక్కడక్కడ కన్పించే లంకగ్రామాలు మినహా అంతా మైళ్ళకొలదీ మహాజలరాశిలా కన్పడింది. మంత్రిగారు, తాము కొల్లేటి విషయము యిదివరలో చాలా విని యున్నప్పటికీ, ఇంత విశాలమైన భూభాగాన్ని ఆక్రమించి యుండునని ఊహింపలేకపోతిమన్నారు. త్రోవలో తూటికాడ, యితరములను తీగలు వారి లాంచీ ప్రొపెల్లరుకు చుట్టుకొని అనేకసార్లు లాంచీ ఆగిపోగా, వానిని ఆపి, అవి తీసివేసి మరల నడపవలసి వచ్చింది. కొన్నిచోట్ల ఈ "తూటు" కనుచూపుమేర అంతా వ్యాపించి, ఆ ప్రదేశమంతా భూభాగమా అనిపించేటుంది. ఈ ప్రాంతంలో అనేకమంది బుర్రగోనెలపై ఈ తూటికాడను కోసికొని వస్తుట మంత్రిగారు చూచారు. పశువులకు ఏమీ గ్రాసం లేనందున ఈ తూటికాడ కోసికొని వెళ్లుచున్నారనీ, ఇది పశువులకు కూడా పుష్టికరముగా ఉండదనీ స్థానికులు మంత్రిగారి కెరింగించారు. సరస్సులో మరికొన్నిచోట్ల 'అంతర తామర' అను తీగె వ్యాపించి, దాని తెల్లటిపూలు కనుచూపుమేర వరకూ తెల్లని తివాసీ పరచినట్లు కనుల విందొనర్చినది. ప్రకృతిపైకి రమణీయముగానే కన్పడినది.

కొక్కిరాల లంకలో ఒక పెద్దభూస్వామి 3000 ఎకరముల భూమి సంపాదించి, దానిని, రెండవపంటకు రెండు యింజనుల సహాయంతో సాగుచేయుచున్నారు. ఈ భూమిలో దాదాపు అంతయూ, మొదటి పంటకూడా సాగుచేయబడింది. కాని అంతయూ నీట మునిగి, యిప్పుడిప్పుడే తేలుచున్నది. ఈ లంకలో ఆభూస్వామి నిర్మించిన, 8000 బస్తాలు పట్టగల ధాన్యపుగిడ్డంగుల పైకప్పులన్నీ తుపానుకు కొట్టుకొనిపోయినవి. రెండు యింజనులూ నీటమునిగి అట్లేయున్నవి. ఇచ్చటకుకూడ చుట్టుప్రక్కల లంకగ్రామాలనుండి అనేకులు మంత్రిగారి దర్శనార్థంవచ్చి తమ యిక్కట్లను మంత్రిగార్కి ఎరింగించిరి. ముఖ్యముగా కొల్లేటి సరస్సులో ఇటీవల ప్రారంభించిన చేపల పట్టుకొనువారిపై పన్ను విధింపు ఈ సంవత్సరము చాలా బాధకరంగా ఉన్నదనీ, యిండ్లు మునిగిపోయి, పంటలు నాశనమైపోయి, పట్టుకొనుటకు చేపలుగాని, చేసికొనుటకు కూలిగాని దొరకని ఈ కష్టపరిస్థితులలో, ఫిషరీస్ డిపార్టుమెంటువారు, స్థానికులను వారు తీసికొనవలసిన లైసెన్సుల నిమిత్తమూ, చెల్లించవలసిన పన్నుల నిమిత్తమూ ఎక్కువగా వత్తిడిచేయుచున్నారనీ, ఈ బాధనుండి తప్పించవలెననీ మంత్రిగారిని కోరారు.

స్థానికుల తరపున మాగంటి రాఘవేంద్రరావుగారు మంత్రిగారు లంకలపరిస్థితిని స్వయంగా తెలిసికొనే నిమిత్తం కష్టముల కోర్చివచ్చుట స్థానికులకు ఉత్సాహకరంగా ఉన్నదని చెప్పిరి. నాటి సమ్మతిగాన్ని, యితరులకు ఇనట విందొసంగిరి. ఇచ్చటకూడ పేదలకు వస్త్రములు పంచిపెట్టడం జరిగింది. కొల్లేటి నుండి పీరు సముద్రమునకు పోవుటకొక్క యొక మార్గమైన ఉప్పుటేరు చూచేనిమిత్తం మంత్రిగారు బయలుదేరి వెళ్లారు.

(స్వ. వి.)

# భీమవరం తాలూకాలో రివిన్యూ మంత్రి పర్యటన

భీమవరం, నవంబరు 27. రివిన్యూ మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు, అల్లూరి సత్యనారాయణరాజు, మాగంటి బాపినీడు శ్రీమతి సి. అమ్మన్నరాజా, జిల్లాకలెక్టరు జనాబ్ షేక్ అహమ్మద్, రివిన్యూ శాఖాధికార్లతో నేటి సాయంకాలం ఆకివీడువద్ద కొల్లేటి వరదలవల్లను గాలివానవల్ల అమితంగా నష్టపడిన ప్రదేశమును చూచి భీమవరం నేడు చేరుకున్నారు. భీమవరంతాలూకా రైతుకాంగ్రెసు కమిటీవారు ఈ తాలూకాలో నష్టపోయిన గ్రామములు —చ్చటి భూములు, తోటలు, మొదలైననాటి నష్టపు అంచనావేస్తూ, రెండవపంటకు నీరున్న్న, పడ్డీ లేకుండా, మూడు సంవత్సరములలో అప్పు తీర్చు కొనేలాగున పెట్టుబడి యున్న్న, తదితర నీటి పరుపాయములు, విత్తనాలు, ఎరువులు సరఫరా చేయించవలసినదిగా కోరారు. మంత్రిగారు ఆలోచిస్తామని చెప్పారు.

నేటి సాయంత్రం 7 గంటలకు భీమవరం తాలూకా విస్సాకోడేరు గ్రామంలో గ్రామ కాంగ్రెసువారి ఆధ్వర్యాన బహిరంగసభ ఏర్పాటు చేయబడింది. సభకు శ్రీమతి చోడగం అమ్మన్నరాజా, (డిప్యూటీస్పీకరు) అధ్యక్షత వహించారు. దంతులూరి నారాయణరాజుగారు అతిథులను సభికుల కెరుకపరిచారు.

తాలూకాలోని తుపానునష్టాన్ని వివరీకరిస్తూ తాలూకాకాంగ్రెసు కార్యదర్శి చెరుకువాడ వెంకట సుబ్బారావుగారు నివేదిక సమర్పించారు.

మంత్రి సీతారామరెడ్డిగారు యిలా ఉపన్యసించారు. "ప్రజా ప్రభుత్వం ప్రజాక్షేమము్నే కృషి నిడుకొని కావలసిన సహాయం సాధ్యమైనంతవరకూ చేస్తుంది. ఇప్పుడు మొత్తం ఎంతనష్టం వచ్చిందని అనే అంచనా కాదు కావలసింది. సహాయం ఏ విధంగా జరగాలా అనేది ముఖ్యప్రశ్న. నేనూ రైతునే రెండు సంవత్సరాల కొక తూరి క్షామం వచ్చే ప్రాంతపు రైతును. నాకు కష్టసుఖాలు తెలుసు. ప్రభుత్వం తరపున నాశక్తికొలది మీకు సహాయం చేయగలనని మీకు వాగ్దానం చేస్తున్నాను. నిజమైన బాధితులకు సహాయం అందేందుకు, నిధిని సద్వినియోగం చేసేందుకు, ప్రజాసహకారం కావాలి. 5 లక్షలు ఈ జిల్లాకు మంజూరు చేశాము. ఆ వెయ్యి కడుపేదవారి సహాయము నిమిత్తమే" అని ముగించారు. శ్రీమతి అమ్మన్నరాజాగారు అధ్యక్షోపన్యాసంచేస్తూ" చేయవలసిన సహాయంచేసి, ఈ తిర్వాలు ఆరిచేసి తర్వాత స్వయంగా చూద్దామని మంత్రిగారు వచ్చారు. ప్రభుత్వంతోపాటు వివిధ సంస్థలుకూడా సహాయంచేయ ప్రయత్నిస్తున్నాయి. రామకృష్ణామిషన్‌వారు బట్టలు ప్రోగుచేశారు. అవి వీరు కప్పాయి) అని అన్నారు. (స్వ. వి.)

# పోలీసుల బాధ్యతలు

## మేజర్ జనరల్ చౌదరీ ఉద్బోధ

హైదరాబాద్, నవంబరు 28 : హైదరాబాద్ మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌధరిగారు నేటి సాయంకాలం హైదరాబాద్ సంస్థాన పోలీసుల తరపున తమ కొసంగబడిన విందులో ప్రసంగిస్తూ, పోలీసులు ప్రజాసేవకులుగా తయారు కావలెనని ఉద్బోధించారు. విందుకు డి. ఎస్. బాజ్పె మొదలగు అధికార్లు అధికార్లు అనేకమంది హాజరయ్యారు.

చౌధరిగారు తమ ప్రసంగము కొనసాగిస్తూ, తాను యిటీవల లండన్ వెళ్ళినప్పుడు అక్కడ న్యాయస్థానాలలో పాలరాతిమీద న్యాయస్థానములన్నిటి చిత్రిస్తూ చెక్కి ఉన్న "తప్పుచేసిన వానిని శిక్షించు కాని పేద పిల్లలను రక్షించు" అన్న మాటలను చూశాననీ, పోలీసు లాగుకు కూడ యిదేతగిన లక్ష్యమనీ అన్నారు. అన్ని పనులను పోలీసులే చేయ్యలేరనీ, ప్రజలు, ప్రజాసంస్థలు, నాయకులు, వారితో సంపూర్ణంగా సహకరించాలనీ అన్నారు.

హైదరాబాదు పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ బి. ని. ఎస్. జెట్లీగారు చౌధరి గారికి కృతజ్ఞతలర్పిస్తూ, పోలీసు చర్య సమయంలో తాను హైదరాబాదులో లేననీ, దానితర్వాత సంస్థానంలో ప్రశాంత పరిస్థితులు నెలకొల్పటానికి ఆయనకృషి ప్రశంసనీయమైనదనిఅన్నారు.

మిలిటరీ గవర్నరు గౌరవార్థం పోలీసులు గౌరవ వందనం చేశారు.

# హైద్రాబాద్ వార్తావళి

1949 ఆగష్టులో జరిగిన పోటీ పరీక్షా ఫలితాల ననుసరించి, హైదరాబాద్ ప్రభుత్వం, హైదరాబాద్ అడ్మినిస్ట్రేటివు సర్వీసులోకి యీ క్రింది 11 మందిని సెలెక్టు చేసుకొన్నది. వారిపేర్లు: బి. సి. ఆర్ విఠల్, బి. ఎస్. రాఘవన్, బి. ఎఫ్. దితియా, సయ్యద్ అబీద్ హుస్సేన్, జి. హనుమంతరావు, మహమ్మద్ జియాఉద్దీన్, సి. ఎస్. శాస్త్రి, జయకర్ పి. జాన్సన్, ఆంధ్రు ప్రకాశరావు గిబ్బ్సు, కె. ఫరీదుద్దీన్ అహమ్మద్ అన్సారీ, ద్వారకనాథ్ కపూర్.

* * *

నాందేడుజిల్లా మలగావ్‌లో డిసెంబరు 19, 20 తేదీలలో పశు, గుర్రముల ప్రదర్శనం జరుగుతుంది.

* * *

'అల్ ఇస్లాం' అని లాహోరునుండి వెలువడుతున్న ఉర్దూ వారపత్రిక హైదరాబాద్ సంస్థానంలోకి రాకూడదని ప్రధాన సివిల్ పరిపాలనాధికారి ఉత్తరువు జారీచేశారు.

* * *

హైదరాబాద్ సంస్థానంలో 1949 సంవత్సరం అనగా 1358 ఫసలీలో కష్టమ్స ఆదాయం గత సంవత్సరంకంటె రెట్టింపు వచ్చినట్లు తెలుస్తున్నది.

# మరుపిళ్ల చిట్టిగారి 51 వ జన్మదినోత్సవం

## విజయవాడలో ఊరేగింపు, సన్మాన సభ

విజయవాడ, నవంబరు 28: "విజయవాడ పట్టణము సరియైన పారిశుద్ధ్యపు ఏర్పాటులు లేక దుర్వాసనగొట్టుచున్నది. పట్టణములోని ప్రతిరోడ్డు రోతను కల్గించుచున్నది. పట్టణప్రముఖులు, చదువుకొనినవారు ఒకతూరి సమావేశమై, పట్టణమును అభివృద్ధి పరచుటకు ఉపాయముల నాలోచింపవలెను. లేకున్న ఇది ఆంధ్రులకు రాజధాని నగరముగా తగియుండదు." అని మరుపిళ్ళచిట్టిగారు నిన్న సాయంత్రము తన ఏబదిఒకటవ జన్మదినోత్సవ సందర్భమున ప్రసంగించుచూ చెప్పిరి.

నిన్న సాయంత్రము 51 ఎద్దుబండ్లతో చిట్టిగారు ఊరేగింపబడిరి. విన్న కోటవారి తోటలో సన్మానసభ జనవరాజు రంగ రాయిగారి అధ్యక్షతక్రింద 5 గంటలకు ప్రారంభమయ్యెను.

ఆహ్వానసంఘము తరఫున ఇవటూరి కోటేశ్వరరావుగారు చిట్టిగారికి సన్మానపత్రమును సమర్పించిరి. చిట్టిగారికి ఆయురారోగ్యములను కోరుచూ డా॥ పట్టాభి కళా వెంకటరావు, బెజవాడ గోపాలరెడ్డి, కుమారస్వామిరాజా, భక్తవత్సలం, చంద్రమౌళి, అల్లూరి సత్యనారాయణ, మాల్యాద్రి రంగయ్య, మంతెన వెంకటరాజు, వి. వి. కేశవరావు, మాగంటి సీతారామదాసు, బాపినీడు, అలపాటి వెంకటరామయ్య, పానుగుపాటి నాగభూషణంగారలు పంపిన సందేశమును చదివినతర్వాత భ్రమరాంబ సేవాదళం, శ్రీ కామాక్షి సువర్ణరజిత వస్తు నిర్మాణసంఘం, రాజకీయబాధితులసంఘం, పట్టాభి గ్రంథాలయం, భవన నిర్మాణ కార్మికవివారిసంఘం జ్యోతి సేవాదళం, విజయవాడ కార్మిక సంఘం, ఒంటెద్దుబండ్లవారి సంఘం, విద్యార్థిసంఘము — సన్మాన పత్రములను సమర్పించిరి. దోమా వెంకటస్వామిగుప్త మహేశ్వర వీరాచారిగార్లు ఆశీర్వదించుచూ పద్యములను చదివిరి.

రాయని రాములుగారు మాట్లాడిన తరువాత చిట్టిగారు తమకీ సన్మానము చేసినందుకు కృతజ్ఞత తెల్పిరి. యువకులందరును కాంగ్రెసు నాయకుల ననుసరింపవలెననుచూ, సోషలిస్టులు కాంగ్రెసుతో తెగతెంపులు చేసికొనుటలో పొరపడిరనియు వారు తిరిగి కాంగ్రెసులో చేరవలెననియు చిట్టిగారు విన్నవించిరి. దేశములో వాక్స్వాతంత్ర్యము మున్నదిగాన, దౌర్జన్యవాదమునకు తావులేదనియు, హేతువాదముపై నమ్మకము గలవారికి ప్రశాంతముగా ప్రచారము చేసికొనుటకు వీలున్నదనియు అనిరి.

రాత్రి 10 గంటలకు కార్యక్రమముంతమయ్యెను. తరువాత హరికథా కాలక్షేపము చేయబడెను. స్వ. వి.

### కీ॥ శే॥ వేదాంతం కృష్ణశాస్త్రిగారు

తెనాలి, నవంబరు 26: తెనాలి తాలూకా హైస్కూలు కమిటీ సభ్యులైన వేదాంతం కృష్ణశాస్త్రిగారు తెనాలిలో వారి స్వగృహమందు వ్యాధిగ్రస్తులై 57 వ యేట దివంగతులయ్యారు. తాలూకా హైస్కూలు ఉపాధ్యాయ సంఘంవారు ప్రధానోపాధ్యాయులైన టి.యస్. నారాయణమూర్తిగారి అధ్యక్షతను సమావేశమై వారి మృతికి సంతాపం తెలియజేశారు.

*ధాంసన్ ఇంజనీరింగు కాలేజి శతాబ్ది ఉత్సవ సందర్భంలో రూర్కీ నగరానికి విచ్చేసిన భారత ప్రధాని పండిట్ నెహ్రూ నవంబరు 25 న ఒక పెద్ద బహిరంగసభలో ఉపన్యసించటం ఈ చిత్రంలో కనిపిస్తుంది.*

# డా॥ పట్టాభి 70 వ జన్మదినోత్సవం

## రాష్ట్రపతికి ఆంధ్రప్రజల శుభాకాంక్షలు

### బందరు

బందరు. పత్రికా రచయితల సంఘం వారు ఈ నెల 24 వ తేదీన ఎమ్. శేషాచలంగారి అధ్యక్షతక్రింద సమావేశమై రాష్ట్రపతి డా॥ పట్టాభిగారిని వారి 70 వ జన్మదిన సందర్భంలో అభినందిస్తూ, వారి సేవా నిరతిని స్మరించారు. ఆంధ్రరాష్ట్ర తీర్మానంలో ఏకీ భావం కనుపరచిన ఆంధ్రనాయకులను ప్రశంసిస్తూ వారొక తీర్మానం కూడా చేశారు.

### విజయనగరం

పట్టణ హరిజనసంఘంవారి ఆధ్వర్యాన, జాతీయ చర్మకార్మిక సంఘ కార్యదర్శి ఏ. వి. ఆర్. మూర్తిగారి అధ్యక్షతను డా॥ పట్టాభి జన్మదినసభ జరిగినది. పట్టణ హరిజన యువక సంఘంవారు జరిపిన మరొక సభలో గోశాల మర్మయ్య నాయుడుగారు పట్టాభిగారి చిత్రపటమును ఆవిష్కరిస్తూ హరిజన సంఘోద్ధారకుడు డా॥ పట్టాభి అని ప్రశంసించారు.

### కర్నూలు

కర్నూలు పట్టణ కాంగ్రెసు సంఘ యాజమాన్యమున ఎస్. ఎస్. గుప్తాగారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగింది. అధ్యక్షులు, కోటయ్యనాయుడు, తదితర ప్రముఖులు డా॥ పట్టాభి జీవిత విశేషాలను గురించి ఉపన్యసించారు.

### బెంగుళూరు

ఆంధ్ర, కర్నాటక ఏకీకరణ సంఘము, ఆంధ్ర బాలసరస్వతీ సంఘముల సంయుక్త యాజమాన్యమున రాష్ట్రపతి జన్మదిన సభ జరిగింది. పి. హెచ్. జగదీశ చంద్రరాయలు గారు అధ్యక్షత వహించారు. డా॥ ఎస్. కామేశ్వరరావు, టి. ఎల్. గుప్త, ఎస్. సదాశివరెడ్డి గార్లు ఉపన్యసించారు.

### తెనాలి

మునిసిపల్ పార్కులో సం. జి. కాంగ్రెసు అధ్యక్షులు అలపాటి వెంకట్రామయ్యగారి అధ్యక్షతక్రింద డా॥ పట్టాభి జన్మదిన సభ జరిగింది. మంతెన వెంకటరాజు, కె. బ్రహ్మానందరెడ్డి, మున్నగు ప్రముఖులు పట్టాభిగారి రాజకీయ చాతుర్యమును గూర్చి ప్రశంసిస్తూ మాట్లాడారు.

### బరంపురం

ఆంధ్ర భాషాభి వర్ధనీ సమాజంలో అయ్యగారి వెంకట సుబ్బారావుగారి అధ్యక్షత క్రింద పట్టాభి జన్మదినోత్సవం జరిగింది. రాష్ట్రపతికి ఆయురారోగ్యములను కోరుతూ తీర్మానం చేయబడింది.

### తాడేపల్లిగూడెం

డా॥ ఎస్. ఆర్. అత్తిలిగారి అధ్యక్షత క్రింద ఒక సభ జరిగినది. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమును సాధించుటకుగాను డా॥ పట్టాభి గారికి దీర్ఘాయువును ప్రసాదింపమని ప్రార్థిస్తూ ఒక తీర్మానం చేయబడినది.

ఒకేహిత సమితి వారు మరొక జన్మదిన సభను జరిపారు.

### పెడన

పెడన పంచాయతీబోర్డు అధ్యక్షుడు కొసనం లింగరాజుగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగింది. డా॥ పట్టాభిగారు ఆంధ్రదేశమునకు చేసినసేవకు కృతజ్ఞతా సూచకంగా వారి స్వస్థలమైన బందరులో ఆంధ్రరాజధాని నెలకొల్పబడుటకు ప్రతి ఆంధ్రుడు కృషిచేయాలని లింగరాజుగారు ఉద్బోధించారు.

### హిందూపురం

స్థానికమునిసిపల్ హైస్కూలులో రాష్ట్రపతి జన్మదినోత్సవం వైభవంగా జరిగింది. హెడ్మాస్టరు పి. ఎస్. మాధుర్యమూర్తిగారు జాతీయపతాక నావిష్కరించారు. గబ్బిటమృత్యుంజయ శాస్త్రిగారు డా॥ పట్టాభిగారు మేధాశక్తిని, త్యాగనిరతిని కీర్తిస్తూ ప్రసంగించారు.

### మహబూబాబాదు

డా॥ పట్టాభిగారి చిత్రపటంతో ఇక్కడ ఒక ఊరేగింపుజరిగింది. సాయంత్రం డా॥ గోపాలరావుగారి అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో 'ప్రగతి' వార పత్రికా సంపాదకుడు వి. హెచ్. చంద్రమౌళీశ్వరరావు, తెలంగాణా కవిదాశరథి, టి. సూర్యనారాయణ, మున్నగుప్రముఖులు డా॥ పట్టాభిని ప్రశంసిస్తూ, తెలంగాణా ప్రజలు డా॥ పట్టాభి నాయకత్వాన విశాలాంధ్రకొరకు ఉద్యమం సాగించాలన్నారు.

# సభలు-సమావేశాలు

బళ్ళారిలో రాఘవ స్మారక నాటకశాలకు డిసెంబరు 4 వ తేదీ ఉదయం మద్రాసు హైకోర్టు చీఫ్ జస్టిస్ పి. వి. రాజమన్నార్ శంకుస్థాపన చేస్తారు. హెచ్. సీతారామరెడ్డి (మంత్రి) గారి అధ్యక్షతను సభజరుగుతుందని రాఘవ స్మారక సంఘంవారు తెలియజేస్తున్నారు.

నెల్లూరు జిల్లా గ్రామోద్యోగుల సంఘ కార్యవర్గ సమావేశం డిసెంబరు 6 ఉదయం 11 గంటలకు ఉదయగిరిలో సత్రంలో జరుగుతుందని కార్యదర్శి తెలుపుతున్నారు.

ప. కృష్ణాజిల్లా రైతు కాంగ్రెసు సంఘ కార్యవర్గసమావేశం డిసెంబరు 8 వ తేదీన విజయవాడలో జరుగుతుంది.

ఆంధ్రట్యుటోరియల్ ఉపాధ్యాయుల ద్వితీయ సమావేశం డిసెంబరు 4 వ తేదీన గుంటూరు బ్రాడీపేట, కళోదయ భవనంలో, హిందూ కాలేజి ప్రిన్సిపాలు వల్లభజోస్యుల సుబ్బారావుగారి అధ్యక్షతను జరుగుతుంది.

### కీ. శే॥ జంధ్యాల భగవచ్ఛాస్త్రిగారు

తెనాలి, నవంబరు 26: తెనాలి తాలూకా హైస్కూలు కమిటీ కార్యదర్శి కోశాధికారియైన శ్రీ జంధ్యాల భగవచ్ఛాస్త్రిగారు మొన్న సాయంకాలం 6 గంటలకు గుంటూరులో వారి స్వగృహంలో వ్యాధిగ్రస్తులై ఆకాల దివంగతులైరి. సంతాప సూచకంగా తెనాలి తాలూకా హైస్కూలు మూసివేయబడెను. హైస్కూలు ఉపాధ్యాయ సంఘంవారు ప్రధానోపాధ్యాయులగు టి. ఎస్. నారాయణమూర్తిగారి అధ్యక్షతను సమావేశమై వారి మరణమునకు చింతించుచూ వారి కుటుంబానికి తమ సానుభూతిని తెలియజేశారు. (స్వ. వి.)

# గోదావరి, కృష్ణల వరదల నిరోధం

## ఐక్యరాజ్య సమితికి చెందిన ఉద్యోగుల రాక

విజయవాడ, నవంబరు 27:— ఆసియా, దూరప్రాచ్య ఆర్థిక సంఘం వారి వరద నిరోధ శాఖకు చెందిన ఉద్యోగులు నార్మండి, వి. కె. కపూర్ గార్లు 26 వ తేదీ ఉదయం మద్రాసు నుండి ఇక్కడకు వచ్చారు. వీరు కృష్ణా, గోదావరి నదుల వరదలను నిరోధించు మార్గములను, వాటి డెల్టాలలో వ్యవసాయజలం, మురికినీరు పారుదల సౌకర్యాలను అన్వేషించటానికై వచ్చారు. వీరు కృష్ణ ఆనకట్టను లాకులను పరిశీలించి, నదినిదాటి బకింగ్ హాంకాలువ లాకులను చూశారు. తరువాత కృష్ణ గట్టుపై 10 మైళ్ళు వెళ్ళి తిరిగి వచ్చారు. భోజనానంతరం వారు ఆ రోజునసే రాజమండ్రి వెళ్ళారు. (స్వ. వి.)

# కీ॥ శే॥ కొవ్విరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారి స్మారక సభ

తెనాలి, నవంబరు 28: మారిసుపేటలో నిన్న సాయంత్రం కీ॥ శే॥ దివాన్ బహద్దూరు కె. సూర్యనారాయణమూర్తి నాయుడుగారి ఆత్మకు శాంతిని కోరుతూ గొప్ప సభ జరిగినది. ఆవుల గోపాల కృష్ణమూర్తి గారు సభకధ్యక్షత వహించిరి. ధర్మారావు, టి. వరలక్ష్మమ్మగార్లు దైవప్రార్థన గావించిరి. శ్రీ నాయుడుగారి జీవిత చరిత్రనుగురించి అధ్యక్షుల వారు విపులముగా నుపన్యసించిరి.

బాబురావు, జి. వెంకటప్పయ్యశాస్త్రి ఆలపాటి సూర్యనారాయణ ఉప్పలపాటి అంకయ్య గుంటూరు నాగభూషణం గార్లు శ్రీ నాయుడుగారికి గాన కళయందున్న అనుభవము వారు చేసిన సేవ ఉపకారమును గురించి ప్రసంగించిరి. అనంతరం నాయుడుగారికి ఆత్మకు శాంతి నొసగ భగవంతుని ప్రార్థించుచూ వారి కుటుంబమునకు సంతాపమును తెల్పుచూ తీర్మానం చేయబడెను (స్వ. వి)

# తిరుత్తని పుత్తూరు తాలూకాల్లో అరవ అచ్చు రేషన్ కార్డులు

నగరి, నవంబరు 28: ఇంతకు పూర్వం తెనుగు అచ్చు రేషన్ కార్డులను సరఫరా చేస్తున్న తిరుత్తని, పుత్తూరు తాలూకాలలో ప్రస్తుతం క్రొత్తగా తిరుత్తణి తాలూకా మొత్తానికి అరవ అచ్చు రేషన్ కార్డులున్నూ పుత్తూరు తాలూకాకు 10 వేలు తెనుగు అచ్చు వేసిన రేషన్ కార్డులను, 20 వేలు అరవం అచ్చు వేసిన రేషన్ కార్డులను సరఫరా చేసియున్నారు. ఎన్నడు లేని యీ మార్పు ప్రజలలో ఆందోళన కలుగ జేస్తున్నది. (స్వ. వి.)

# బొలారం రెసిడెన్సీ భవనంపై భారత జాతీయ పతాక ప్రతిష్ఠాపన

హైద్రాబాద్, నవంబరు 28: హైద్రాబాద్‌లో మిలిటరీప్రభుత్వం పరిసమాప్తపై దానిస్థానే సివిల్ పరిపాలన ఏర్పడినప్పుడు ప్రస్తుతం బొలారం రెసిడెన్సీ భవనంమీదవున్న దక్షిణ భారత సైనిక పతాకంస్థానే భారత జాతీయ పతాక ప్రతిష్ఠింపబడుతుంది. ఎం. కె. వెల్లోడీ గారు మిలిటరీ గవర్నరునుండి బాధ్యతపుచ్చుకొన్నప్పుడు యిది జరుగుతుంది.

మేజర్ జనరల్ చౌధరీగారు డిసెంబరు 2 న సంస్థానం వదలివెళ్ళిపోతారు. ఆయనకు సికింద్రాబాద్‌లోను, హైద్రాబాద్‌లోను, బేగంపేటలోను భారతసైనికులు గౌరవవందనం సమర్పిస్తారు.

# హైద్రాబాద్ గవర్నర్ జనరల్ ఆగమనం

హైద్రాబాద్, నవంబరు 29: ఇండియా గవర్నరు జనరల్ సి. రాజగోపాలాచారిగారు డిసెంబరు 20 న హైద్రాబాద్ వచ్చి యిక్కడ మూడురోజులుంటారు.













Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.